# మహాసాధ్వులు

[ నాటకం ]

సోమంచి యజ్ఞన్నశాస్త్రి



దేశికవితామండలి
విజయవాడ-2

## పాత్రలు:

రాఘవేంద్రరావు: దివాన్జి - జిల్లాఆఫీసరు

చంద్రిక: ఆయన రెండవభార్య

కవిత: ఆయన మొదటిభార్య కూతురు

నాయుడు: జడ్జి

డాక్టరు. చంద్రశేఖర్: జిల్లామెడికల్ ఆఫీసరు

ఆచార్లు: హెడ్ మాష్టరు

వెంకప్పపంతులు: పోష్టుమాష్టరు

రామచంద్రయ్య: చిన్నఉద్యోగి

రుద్రయ్య: ధర్మకర్త

భద్రయ్య: పురోహితుడు

నరసన్న: నౌకరు

లక్ష్మణస్వామి: హోటలుసర్వరు

ఇంకా బంట్రోతు వగైరాలు వస్తారు.

దీనికి ప్రఖ్యాత రష్యను నాటకకర్త 'గోగోల్' వ్రాసిన 'Inspector general' అన్న నాటకంమాతృక. నాలుగో అంకంలో రెండు పద్యాలూ, ఘంటసాల వెంకటేశ్వరరావు గారిచ్చిన గ్రామఫోను రికార్డులోనివి.

## అంకితం:

బొంబాయి ఆంధ్రుల ప్రతి సదుద్యమానికీ ప్రోత్సాహ మిచ్చి, వారి సంస్థలకి అవసరమైనప్పుడల్లా అండగా నిలిచిన కీర్తికాయుడు, బొంబాయిలో ఆంధ్ర నాటక రంగానికి కలలుగన్న లలిత కళాభిమాని, సాహసి, స్నేహశీలి, స్వర్గీయ శిష్టా వెంకటరావుగారికి.

ఈ నాటకాన్ని ఎవరైనా ప్రదర్శించుకో వచ్చును. ప్రదర్శించినప్పుడు మాత్రం బొంబాయిలో ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసయిటీవారు నిర్వహిస్తున్న స్కూలు ప్రోత్సాహ నిమిత్తం అయిదు రూపాయలు విరాళం సొసయిటీ కార్యదర్శిగారి పేర—

Andhra Education Society,
T. 57 Sion Road, Bomby-22
పంపించ ప్రార్థన.

# మహానుభావులు

[రాఘవేంద్రరావుగారి యింట్లో ముందు హాలు. సంస్థానానికి ఆయన లోగడ దివాను. ఇప్పుడు ఆ సంస్థానం రాష్ట్రంలో విలీనమై ఒక జిల్లాగా రూపొందింది. ఆయన జిల్లా ఆఫీసరయ్యాడు. ఈ పరివర్తనాన్ని సూచించేటట్టుగానే ఆ హాలు అలంకరణకూడా పాతకొత్తల కలయికలో వుంటుంది. ఒక పక్కన సంస్థానపు జమీందారుగారివీ జమీందారిణీగారివీ రంగుల బొమ్మలు. అవి చెమ్కీదండలతో అలంకరించబడి వుంటాయి. మరో పక్కని వాటికంటె కొంచెం పెద్దవి రాజేంద్రప్రసాద్, జవహర్‌లాల్ నెహ్రూల ఫోటోలు వీటికి నూలు దండలు.

తెర లేచేసరికి స్టేజీమీద ఎవరూ వుండరు. తరవాత తిరువెంగళాచార్యులూ, పరంధామరావునాయుడూ మాటాడుకుంటూ ప్రవేశిస్తారు.]

నాయుడు: ఆచార్లుగారూ. ఫలితం తేల్చారు గాదు!

ఆచార్లు: శకునం, చూశారూ నాయుడుగారూ, గోడమీద పిల్లి...

నాయుడు: (మధ్యలో అందుకుని) గోడమీద పిల్లి కాదయ్యా; మనకి రోడ్డుమీద కనిపించింది పిల్లి. నల్లగండు పిల్లి. మన యెడమనించి (నిటారుగా నించుని ఎడమచెయ్యి కుడివైపుకి విసురుతాడు; ఎడమనించి కుడికి వెళ్లిందని సూచించడానికి. దాంతో అతనికి సందేహం వొస్తుంది. కుడిచెయ్యి ఎడమకి విసిరి చూసుకుంటాడు ఇదిరైటు అయినట్టు తోస్తుంది.) మన కుడినించి యెడమకి పరిగెత్తింది.

ఆచార్లు: అదే... నల్లపిల్లి అవడం శుభసూచకం. కుడినుంచి ఎడమకు పోవడం అశుభ సూచకం. అయితే శుభం, కాకపోతే అశుభం! గోడమీద పిల్లి...

నాయు: మళ్ళీ గోడమీద పిల్లి అంటావు, రోడ్డుమీద పిల్లి అయితే—

అంటూవుంటే డాక్టర్ చంద్రశేఖర్ ప్రవేశిస్తాడు. పిల్లి అన్నమాట అతనికి వినిపిస్తుంది.

డా. చం: మీ కోళ్ళనేమైనా పిల్లి ఎత్తుకు పోయిందా ఏమిటి నాయుడుగారూ?

నాయు: అబ్బే. శకునం సంగతి. అయితే మిమ్మల్నీ పిలిపించాడూ? ఎందుకూ?

డా. చం: నేనూ అదే అడుగుదా మనుకుంటున్నాను. మీ కింకా దివాన్జీగారి దర్శనం కాలేదన్నమాట.

నాయు: అంతః పురంలోంచి పైకొచ్చినట్టు లేదు.

ఆచార్లు: ద్వితీయం కాదండీ.

అంటూ వుంటే గబగబ నడుచుకుంటూ రాఘవేంద్రరావు గారు ప్రవేశిస్తారు ఆచార్లు నోరుమూసుకుని గుడ్లు మిటకరిస్తాడు. మొదట నాయుడుగారూ తరవాత మిగతాయిద్దరూ నమస్కరిస్తారు. రాఘవేంద్రరావుగారు నమస్కారం అందుకుని మధ్య సోఫాలో కూర్చుంటారు. అందరినీ కూచోమని సంజ్ఞ చేస్తాడు. అంచరూ కూచుని ఆయన ఏమి చెబుతాడో అని ఆత్రంగా వేచివుంటారు. ఒక్క క్షణం నిశ్శబ్దం.

రాఘు : (చాలా సీరియస్‌గా మొహం పెట్టి) మీకు ఓ ముఖ్యమైన రహస్యం చెబుదామని పిలిపించాను. (సోఫాలో తను ముందుకి జరుగుతాడు. మిగతా వాళ్ళు కూడా ముందుకి వొంగి జాగ్రత్తగా వినడం ప్రారంభిస్తారు) ఒక ఇనస్పెక్టర్ జెనరల్ వొస్తున్నాట్ట ఈ వూరికి; రహస్య పరిశోధనలు చెయ్యడానికి!

నాయు: ఏమిటీ!

ఆచా : (నోరు తెరగక) ఇనస్పెట్టర్ జనరలా?

రాఘు : ఇనస్పెట్టర్ కాదు ఇనస్పెక్టర్ జెనరల్. ఢిల్లీనించి యెకాయెకి, ప్రచ్ఛన్న వేషంలో వొచ్చేస్తున్నాట్ట.

డా.చం: రహస్య పరిశోధనలు చెయ్యడానికి.

రాఘు : నే అనుకుంటూనే వున్నా ప్రమాదం ఏదో రాబోతోందని. మొన్న రాత్రంతా ఒకటే పీడకల. పోతుల్లాటి రెండు నల్లటి ఎలకలు. వాసన చూసుకుంటూ (ముక్కు పుటాలు ఎగరేసి అభినయిస్తాడు) ఇల్లంతా పరిగెత్తి పారిపోయాయి. ఏమిటి ఈ కల సూచన అని ఆలోచిస్తూ వుంటే సాయంకాలానికి ఈ వుత్తరం.

ఆచా : ఏ వుత్తరం?

డా. చం: ఎవరి దగ్గరనించి?

రాఘు: మా వేలువిడిచిన మేనల్లుడు లేడూ ఢిల్లీలో...

నాయు: సంస్థానం విలీనం కాకమునుపే మంత్రాంగం చేసి రాజ్యసభా కార్యాలయంలో ఉద్యోగం వేయించారూ!

రాఘు: (అమాట ఉనడం అంతేక్షష్టంలేనట్లు కొంచెం గుర్రు జేసి నాయుడుకేసి చూస్తూ) ఊఁ. అతని దగ్గరనించే- (ఉత్తరం తీసి) చదువుతా వినండి. ప్రియమైన మామ గారికి. మీ ప్రియ మేనల్లుడు నమస్కారములు (తర వాత ఉత్తరం కొంత లోలోపలే చదువుకుంటున్నట్లు అస్పష్టంగా గొణుగుతాడు) ఆ... ఇదీ- ఒక పెద్ద గవర్నమెంటు ఆఫీసర్ని, ఇన్‌స్పెక్టర్ జనరల్ హోదా లోవున్న ఆయన్ని మనజిల్లా అంతా తణిఖీ చెయ్య డానికి కేంద్రప్రభుత్వం పంపిస్తోంది. ఆయన ప్రచ్ఛన్న వేషంలో మామూలు మనిషిలాగ తిరుగుతూ రహస్య పరిశోధనలు చేసి కేంద్ర ప్రభుత్వానికి రిపోర్టు పంపిస్తా డని నాకు బాగా నమ్మకంగా తెలిసింది. ఆయన ఏ విషయాలు పరిశోధన చేస్తాడో ఆచోకీ తెలియ లేదు. అంచేత అన్ని విషయాల్లోనూ జాగ్రత్తగా వుండడం శ్రేయస్కరం. మన సంస్థానం విలీనం చేసి నప్పుడు ఆ సిపాస్తులు ప్రభుత్వానికి అప్పగించడం లోనూ, ఉద్యోగాల విషయంలోనూ (ఆపి అందరి వంకా ఒకమాటు చూసి) లౌక్యం జరిగిన సంగతి తెలుసు కనక హెచ్చరిస్తున్నాను. దేశంలో లంచాల గొడవ హెచ్చుగావుంది కనక ఆ విషయంకూడా ఆయన ఓ కంట కనిపెట్టవచ్చును. జాగ్రత్తగా వుం డండి, ఆయన ఏ నిమిషాన్నయినా ఆ వూరు చేర వచ్చును. అసలు ఈ వుత్తరం అందేనాటికే ఆయన వొచ్చేసి (ఒక్కొక్క అక్షరం పలుకుతూ) మారు

వేషంలో వున్నోళ్ళ ఎక్కడైనా వుండీవుండకపోవచ్చును !
నిన్న నాయంకాలం నించీ నాయనమ్మకి జలుబుగా వుంది
ఇక్కణ్ణించి ఇహ ఇంటి వ్యవహారాలే లెండి. (కాగితం
మడిచి జాగ్రత్తగా జేబులో పెట్టుకుంటూ) ఇదీ పరిస్థితి.

ఆచా : పరిస్థితి చాలా ఆందోళన కరంగానే వుంది. ఇప్పుడు
తేలింది చూశారా, నాయుడుగారూ! పిల్లి కదిలించి
ఎడమకి వెళ్ళిన ఫలితం!

నాయు: ఇంకో తమాషాకనిపెట్టారా ఆచార్లుగారూ! దివాన్ జీ
సాహెబ్ గారికి ఎలకలు కనిపించాయి; మనకి
పిల్లి !

రాఘు: (గట్టిగా) కొంప ముంచుకొస్తోంది. జాగ్రత్త పడం
డయ్యా అని హెచ్చరిస్తుంటే ఎలికా, పిల్లీ, అంటూ
కూచుంటారు ఇంకా !

ఆచా : అవునవును, ఎంత ప్రమాదం! వెంటనే జాగ్రత్త
పడాలి. కూచోకూడదు (అని లేచి నించుంటాడు.
తరవాత ఏం చెయ్యాలో తెలీదు. ఒకమాటు ముక్కు
పొడుం పీల్చి అందరి మొహాలూ చూస్తాడు.)

డా. చం: ఎవడో తెలియదు! ఎక్కడికొస్తాడో తెలియదు ! !
ఏంకావాలో తెలీదు!!! ఏం జాగ్రత్త పడతాం!!!

రాఘు: దివాణంలో దాసీలకి మాత్రమే వైద్యం చెయ్య్య
టానికి కుదుర్చుకున్న నాటు వైద్యుడివి జిల్లా మెడికల్
ఆఫీసరూ ఆసుపత్రి సూపరిటెండెంటూ అయావుకదా!
ఏం జాగ్రత్త పడతానంటావా? ఆసుపత్రిలో ఎంత
మంది రోగులున్నారిప్పుడు ?

డా. చం: ఇప్పుడా, ఇప్పుడేనా... రోగులేనా... (అని నసుగు తాడు)

రాఘు: పిళ్ళు నములుతున్నావేం?

డా. చం: ప్రస్తుతం... ఎవరూ లేరు!

రాఘు: అదేమిటి! మొన్న ఆసుపత్రిలో మంచాలనిండా మనుష్యుల్ని చూశాను!

డా. చం: వాళ్లు రోగులు కారండి... మా బావమరిది కూతురి పెళ్ళికొచ్చిన చుట్టాలు. సౌకర్యంగా వుంటుందని, ఆసుపత్రిలో నలుగురయిదుగురే రోగులుంటే వాళ్లని పంపించేసి, విడిదికిచ్చాను.

రాఘు: (వ్యంగ్యంగా) భలే భలే! పెళ్ళి భోజనాల ఫలితంగా ఎలాగా జబ్బులుచేసి వుంటాయి. ఆసుపత్రి దుస్తులేయించి అందర్నీ పడుకోపెట్టు.

డా. చం: నిన్న సాయంకాలం అందరూ వెళ్లిపోయారు. ఎలా? (చేతులు నలుపుకుంటూ నిస్సహాయుడై వుంటాడు)

రాఘు: (ఎక్కిరిస్తూ) ఎలా? (కోపంతో) పరుగెత్తి ఎవర్నైనా పట్టుకో (అనేసరికి డా. చం. నిజంగా పరుగెడుతూ నాలుగుఅడుగులువేస్తాడు) ఆగు... పుల్లాయ వేమవరం చెయ్యకు. వూళ్ళో బిచ్చమెత్తుకునేవాళ్ళని, మరీ కుంటీ గుడ్డీ కాకుండా చూసి, పదిమందిని పట్టుకొచ్చి, ఆసుపత్రిలో పడేయించు.

డా. చం: వెంటనే చేయించేస్తానండి.

రాఘు: మనుష్యుల్ని తోలుకొచ్చి అక్కడ పడేస్తే చాలదు. మందు పుచ్చుకుంటున్న రోగుల్లా వాళ్ళు కనిపించే ట్టు చెయ్యాలి. పక్కలమీద దుప్పట్లూ గిప్పట్లూ మార్పించి ఉతికినబట్టలు తొడిగించు వాళ్ళకి!

డా. చం: అదెంత సేపు!

రాఘు : అంతే కాదు. రోగి ఏజబ్బుతో బాధపడుతున్నాడో, ఏం మందు యిస్తున్నారో, ఎన్నిరోజులు, నెలలు, సంవత్సరాలకిందట ఆసుపత్రిలో చేరాడో ఓ కాగితం మీద వ్రాసి మంచం దగ్గిర పెట్టొద్దూ?

డా. చం: ఏం జబ్బు... (అని నసుగుతాడు)

రాఘు : మెడికల్ డిక్షనరీ తిరగేసి ఘోరమైన జబ్బులు ఏరి వ్రాయవయ్యా! లాటిన్ పేర్లు తియ్యి. ఇంగ్లీషుడిక్షనరీ కొరకబడకపోతే ఆయుర్వేద రత్నాకరమూ, చరక సంహితా తిరగేసి, సంస్కృతం పేర్లు పట్టుకో. ఇంగ్లీషు అక్షరాల్లో వ్రాయి.

డా. చం: అలాగే... అలాగే—

రాఘు : మందులూ ఆ విధంగానే... అన్ని జబ్బులకీ ఆనంద భైరవి మాత్రలే మందు కాదు. తెలిసిందా?

డా. చం: మీరలా అనడం న్యాయమా! శీతాంశురసం, వాత పిత్త సంహారీ, అభ్రకం ప్రమాదమైన కేసుల్లో చింతా మణి కూడా వాడుతూ వుంటాం.

రాఘు : ఆఁ వాడుతూ వుంటాం! ఈ మందులెవరికీ కావా లయ్యా ఇప్పుడు. పెన్సిలిన్, గిన్సిలిన్ తగిలించాలి, కాగితం మీదయినా!

డా. చం: వాచ్చే ఆయన ఇనస్పెక్టరన్నాను, అంటే వైద్యం ఏమీ తెలిసుండదన్నమాట! (ధీమాగా) కళ్ళు చెదిరి పోయేటట్టు రోగాలూ, మందులూ వ్రాసేస్తాను? చూసుకోండి!

రాఘు : ప్రగల్భాలకేమీ లోటు లేదు. శివశివా! ఎలాంటి నాడివి దొరికావయ్యా. నవ్వు జబ్బులు కుదర్చలేవు గాని, ఏ తప్పులు దిద్దుకు నేనరికి మాకు గుండెదడ పట్టుకుంటోంది.

డా. చం: (చిన్న బుచ్చుకుంటాడు. ఆచార్లుగారూ, నాయుడుగారూ నవ్వుతారు. నాయుడు గట్టిగా హె హ్హె హ్హె అని హేళనగా నవ్వుతాడు. రాఘువేంద్రరావు కూడా గట్టిగా నవ్వుతూ నాయుడికేసి చూస్తాడు.)

రాఘు : (కనుబొమ్మలు ఎగరేస్తూ, నాయుడిని ఉద్దేశించి) మన సంగతేమిటి?

నాయు: మనకేం. అతిగాడికి లా కూడా ఏమీ తెలిసుండదు. మనకేం భయం లేదు.

రాఘు : లా తెలియకపోతే మెందుకయ్యా! ఎన్నిమాట్లు చెప్పినా నీ కోళ్ళ పెంపకం కోర్టు, రూములోంచి తప్పించక కోర్టంతా కోళ్ళమయం చేసి పెట్టావుగదా! తనిఖీకి వొస్తే కోర్టులో కేసులకంటే కోళ్లు ఎక్కువున్నాయని కని పెట్టలేడూ!

నాయు : అరెరే! వెంటనే సదరు కోళ్ళనన్నిటినీ మా వంటింటికి పంపించెయ్యమని ఉత్తరువు జారీచేస్తాను. రాత్రి భోజనానికి దయచేస్తారా యేమిటి?

రాఘు: ఈ గండం గడిచి బయటపడనివ్వవయ్యా! మరో మాట. లంచాలు పుచ్చుకోడం కొన్నాళ్లు కట్టి పెట్టాలి!

నాయు: లంచాలా! మిగతా వాళ్ళకంటె నేను ఎప్పుడైనా ఏమైనా ఎక్కువగా పుచ్చుకున్నానా చెప్పండి! అయినా ఎందుకో లంచాలు పుచ్చుకుంటానని నాకు మాత్రం పేరు పడిపోయింది. ఏం చేస్తాం! ఎలాగూ పేరు రానే వచ్చిందిగదా, నేను మానుకున్నా పేరు పోతుందా అని బహుమానమైనా తీసుకొస్తే స్వీకరిస్తూ వుంటాగాని...

రాఘు: తృణమో పణమో పుచ్చుకుంటే తప్పని అనడంలేదు కాని కొంచెం గుంభనంగా చేసుకోవాలి. కోర్టు హాల్లోనే పుచ్చుకోడం మానెయ్యాలి. ఆ గుమాస్తా గాడిని గట్టిగా మందలించండి. మీకంటె రెండాకులెక్కువ చదివాడు.

నాయు: (మొహం చిన్నబుచ్చుకుని) కానీండి. ఎందుకొచ్చిందో నాకీ అపద్రిష్ట!

రాఘు: మంచిపేరు, మంచి ప్రతిష్ఠా వుంటుంది; మా భజన సమాజంలో చేరి నలుగురు భక్తుల మధ్య నీ పేరు వినిపించనివ్వవయ్యా, పుణ్యం, పురుషార్థం కూడా కలిసొస్తాయి - అంటే వింటావా? ఒకటే ఇహ లోక తాపత్రయం; ఇంట్లో వున్నంతసేపు పెళ్ళాం- పిల్లల తాపత్రయం; కోర్టుకొచ్చిం దగ్గర్నించీ వాళ్ళ తాపత్రయం!

ఆచా: యదార్థం పలికారు దివానుగారు. భజగోవిందం, భజగోవిందం, గోవిందం భజ మూఢమతే!

నాయు: దివాణంలో పురాణం చెప్పే ఆచార్యుని హైస్కూలు హెడ్మాస్టరుని చేసి కూచున్నావు. నీ సంగతి ఆలోచించుకో-అనవసర సలహాలు చెప్పక.

ఆచా: మీ పవరేదేమిటి, గ్రామమునసబల్లా జిల్లా జడ్జి? గురివింద గింజ తనకింద నలుపెరగదు.

నాయు: నే గురివింద గింజనయితే నువ్వు మట్టిపెడ్డవి.

రాఘు: ఛేష్. ఆవొచ్చేవాడి యెదురుగుండానే తిట్టుకుంటే, రహస్యపరిశోధనలు చెయ్యవలసిన అవసరం వాడికేమీ వుండదు.

నాయు: నన్నెందుకండీ అనవసరంగా...

ఆచా: నేనేమీ అనందే, ఆయనే ఘుంఘుగా నన్ను......

రాఘు: (కోపంతో) చాలుచాలు కట్టిపెట్టండి. (ఒక్కక్షణం నిశ్శబ్దం. ఆచార్లుతో) ప్రయివేటు ట్యూషన్ పేరుచెప్పి పిల్లలచేత మీ దొడ్లో నీళ్ళుతోడించుకోడం వెంటనే బందుచేయించండి.

ఆచా: చిత్తం.

రాఘు: మీ హిస్టరీ మేస్టరికి అశోకుడు ముందో అక్బరు ముందో కూడా తెలీదు. పాఠాలు తిరగేసి మరీ రమ్మను స్కూలుకి.

ఆచా: చిత్తం.

రాఘు: ఆ లెక్కలు పూస్తాపత్తో చెప్పి- ఎక్కిరించినట్టు అలా మొహం పెట్టొద్దని. ఇనస్పెక్టర్ జెనరల్ గనక చూసినా. తననే ఎక్కిరించాడనుకుని డొక్క వాలికలు చెయ్యగలడు.

ఆచా: చిత్రం. చెప్పానండి, లక్షసార్లు చెప్పాను... 'ఏం చెయ్యను. బ్రహ్మదేవుడు నాకిలా పెట్టాడు' అంటాడు.

రాఘు: బ్రహ్మదేవుడే వుద్యోగం కూడా గొరిగేస్తాను; తీరి పోతుంది.

ఆచా: చిత్రం. 'నుదుటన్ వ్రాసిన వ్రాత మార్చగలమే నూరేండ్లు చింతించినన్.'

రాఘు: వాడి వుద్యోగం పోయివూరుకోను. అలాటివాడిని స్కూల్లో వుంచినందుకు నీ పీకలమీది కొస్తుంది. వేదాంతం కట్టిపెట్టి వెంటనే జాగ్రత్తపడు.

ఆచా: చిత్రం. చిత్రం.

రాఘు: ఇనస్పెక్టర్ జనరల్ దగ్గిర ఈ చిత్రం చిత్రం పనికి రాదు. యెస్, సార్ అనాలి.

ఆచా: చిత్రం, చిత్రం.

రాఘు: అదుగో !

ఆచా: యెస్ సార్ (అని లేచి సలామ్ పెడతాడు. అందరూ నవ్వుతారు)

నాయు: ఆచార్లుగారూ, ఆ ఇనస్పెక్టర్ జెనరల్‌కి మాంచి పంగనామం పెట్టాలి !

రాఘు: ఆ పెట్టారు. అసలు వాడెవరో మనకి సమయానికి తెలుస్తేగా. మనం ఇలాకూర్చుని వుండగా అకస్మాత్తుగా ఇక్కడికొస్తాడనుకో. వొచ్చి, ఎవరు. జడ్జి? అంటాడు. పరంధామరావు నాయుడు. (నాయుడు లేచి నుంచుని నమస్కరిస్తాడు) కోర్టులో కేసులు వినే బదులు కోళ్ళు పెంచుతున్నావా? అంటాడు. మారు వేషంలో వొచ్చేవాళ్ళతో ప్రమాదమే యిది.

పోస్టు మాస్టర్ వెంకప్ప పంతులు ప్రవేశిస్తాడు

వెంక : ఏమిటా ప్రమాదం. ఎవరా వొచ్చే ఆఫీసరు!

రాఘు: నీకెవరు చెప్పారు?

వెంక: భద్రయ్యా. మీకేదో వుత్తర మొచ్చిందట!

రాఘు: నోట్లో నువ్వుగింజ నానదుగదా. పరమ రహస్యమని మరీ మరీ చెప్పాను.

వెంక : నాదగ్గిర దాపరికమా?

రాఘు: నీ సంగతి కాదు; అసలువాడి బుద్ధి...

వెంక : ఇంతకీ సంగతేమిటి?

రాఘు: ఇక్కడ సంగతి సందర్భాలు కనిపెట్టడానికి మారు వేషంలో ఒక గవర్న మెంటు ఆఫీసరొస్తున్నాట్ట. ఢిల్లీ నించి వుత్తర మొచ్చింది.

వెంక : అదా సంగతి!

రాఘు: నీ పంగతేమిటి?

వెంక : నాకేం. నేనూ ఢిల్లీ గవర్న మెంటు వాడినే! తమ సంగతేమిటి?

రాఘు: మనకి భయమేలేదు. మనం ఎప్పుడైనా బహుమతులు వగైరా స్వీకరించినా, వాటిని లంచాలనడానికి వీల్లేదు. ఎవరన్నా అంటే డొక్క చీల్చేయొచ్చు. మనమీద ఎవరూ ఫిర్యాదు చెయ్యడానికి సాహసించరుగా... ఒకవేళ ఏమైనా ఆకాశరామన్న అర్జీలు వెళితే మాత్రం... వెళ్ళుంటాయంటావా? మాట... (వెంకప్పని జబ్బ పుచ్చుకుని కొంచెం ముందుకి తీసుకొచ్చి) పోస్టులో వెళ్లే ఉత్తరాలూ, వొచ్చే ఉత్తరాలూ... ఓకంట... ఏమిటి? మళ్ళీ జాగర్తగా అంటించెయ్యొచ్చునుగా!

వెంక : మనకి చెప్పాలా? అన్ని ఉత్తరాలూ మనం చదివిస్తూనే వుంటాంగా! దురుద్దేశం ఏమీలేదు. కేవలం కుతూహలం! భలే తమాషాలు వ్రాస్తూవుంటారులెండి. కోపతాపాలు; ప్రేమ సల్లాపాలు... ఊం. నాదగ్గిరో ఉత్తరముంది.

రాఘు: ఢిల్లీనించి రాబోయే ఆఫీసర్ని గురించి ఏమైనా వుందా?

వెంక : లేదు. ఇది ప్రేమలేఖ. మన సుబ్బాయమ్మగారి సంగతేమిటనుకున్నారు!

రాఘు: పీకలమీదికొచ్చినప్పుడు సుబ్బాయమ్మ ప్రణయం గొడవ మనకెందుకు?... మనమీద ఏమైనా అర్జీలు వగైరా కనిపిస్తే వాటిని గప్‌చిప్...ఏమిటి?

వెంక : తప్పకుండా.

నాయు: జాగ్రత్త. పోస్టులో పడిన ఉత్తరాలని ముట్టుకుంటే ఇండియన్ పీనల్ కోడులో... సెక్షనేదో సమయానికి జ్ఞాపకం రావడం లేదు గాని... నేరం! పదిహేనేళ్ళు జైలు.

రాఘు: శభాష్! స్వయంగా పీక తెగ్గోసుకో, నీ ప్రాణంమీదికి రాకుండా నేను ఉపాయం ఆలోచిస్తున్నాను. నువ్వు మమ్మల్ని బెదిరించకు!

నాయు: అబ్బెబ్బె. బెదిరించడం లేదు–మాటవరసకి చెప్పాను.

రాఘు: మాటవరస! సరసాలకి ఇదా సమయం. మారు వేషంలో మొగుడు అకస్మాత్తుగా తలుపు తెరుచుకుని...

అకస్మాత్తుగా తలుపు తెరుచుకుని రుద్రయ్యా, భద్రయ్యా ఆయాసంతో పరుగెత్తుకుంటూ వస్తారు.

భద్ర: ఆశ్చర్యం! ఆశ్చర్యం!!

రుద్ర: అద్భుతం! అద్భుతం!!

అందరూ: ఏమిటది? ఏమిటది?

భద్ర: నేనూ రుద్రయ్యా,. శ్రీ సీతారామాంజనేయ కాఫీ హోటలికి...

రుద్ర: (మధ్యలో అడ్డుతగిలి) కాదు కాదు. శ్రీ సీతారామాంజనేయ కాఫీ లాడ్జింగ్ అండ్ బోర్డింగ్ హౌస్.

భద్ర: రుద్రయ్యా, మధ్య మధ్య జొరబడక నన్ను చెప్పనీ.

రుద్ర: మధ్య మధ్యన ముఖ్యమైన ముక్కలు మరిచిపోతున్నావు, నన్ను చెప్పనీ!

భద్ర: నీకు చెప్పడం అసలు తెలీదు. అవసరమైనవీ, అనవసరమైనవీ కలిపేసి. అంతా గజిబిజి చేస్తావు.

రుద్ర: మరిచిపోయి గజిబిజి చేసేది నువ్వు! నేను తు. చ. తప్పకుండా చెబుతాను.

భద్ర: తు. చ. తప్పకుండా చెబుతాను, నువ్వు మాట్లాడకు.. దివాన్‌జీగారూ, రుద్రయ్యని మాట్లాడొద్దనండి.

రాఘు: ఏం జరిగిందో చెప్పండి ... రుద్రయ్యా, ఇక్కడ కూచో ... ఊ—నోరెత్తకు భద్రయ్యా, చెప్పు.

భద్ర: చెబుతున్నా. పొద్దున్న మీకు నాకా వృత్తాంతం సంగతి చెప్పారా! ఇదేమిటిరా, ప్రమాదం... ఆంజనేయస్వామికి కొబ్బరికాయలు కొడితే మంచిదికదా అనుకున్నాను. కాని కొట్లు తెరిస్తేగాని కొబ్బరి కాయలు దొరకవు! ఈలోగా రుద్రయ్యని లేపి గాయత్రీ జపం చేయిస్తే మంచిదికదా అనుకుని రుద్రయ్య ఇంటికి బయలుదేరాను. దారిలో పోస్టుమాస్టరుగారు కనిపిస్తే వారితో ఈమాట రెండుముక్కల్లో చెప్పేసి గబగబా రుద్రయ్య ఇంటికి వెళుతూవుంటే ...

రుద్ర: (అందుకుని) నేనే యెదురు వచ్చాను.

భద్ర: నువ్వు చెప్పొద్దు ... రుద్రయ్య కనిపించాడు. ఎక్కడ? ... నిన్నే చెప్పొద్దన్నాను ... సుబ్బిశెట్టి పెసరట్ల దుకాణం దగ్గర ... రుద్రయ్యా, గాయత్రీ జపం చెయ్యాలి అన్నాను.

రుద్ర: ఎందుకూ, అన్నాను.

భద్ర : దివాన్ గారికీ, ఇతర ఆఫీసర్లకీ ప్రమాదం ఏమీ రాకుండాను అన్నాను.

రుద్ర : ప్రమాదం ఏమిటీ, అన్నాను.

భద్ర : దివాన్ గారికి వృత్తర మొచ్చిన సంగతి నీకింకా తెలీదా, అన్నాను.

రుద్ర : ఏ వృత్తరమూ, అన్నాను.

రాఘు : అబ్బబ్బబ్బ! ఒక్క కాకిగోల-విషయం తేల్చకుండా!

భద్ర : రుద్రయ్యా, మధ్యలో నువ్వు మాట్లాడితే ఎంత అనర్థమో చూశావా? ఇహ నేనే చెబుతాను. అంతా! అంతా!! అంతా!!!... దానిసంగతి రోడ్డుమీద చెప్పవలసింది కాదు, ఇంటికిపద - న్నాను. రెండు పెసరట్లు కడుపులో పడేసిపోదాం- అన్నాడు. గాయత్రీ జపం చెయ్యవలసిన వాడివి, పెసరట్లు తినకూడదు- అన్నాను. నిన్న వెంకట్రామయ్య గారింట్లో తద్దినం వల్ల రాత్రి భోజనం లేదు. ఇంత ఆకలితో గాయత్రీ జపం చెయ్యలేను. అన్నాడు ప్రాణం నిలబెట్టుకోడానికి కావలిస్తే కసిన్ని పాలుతాగు; పెసరట్లు మాత్రం తినడానికి వీల్లేదని శ్రీ సీతారామాంజనేయ కాఫీ హోటలికి తీసుకెళ్లాను.

రుద్ర : కాఫీహోటల్ కాదు; కాఫీ, లాడ్జింగ్ అండ్ బోర్డింగ్ హౌస్!

భద్ర : అదే. అదే. టేబిల్ దగ్గిర కూచుని రుద్రయ్యకి ఓ గ్లాసు పాలూ, ఎలాగా వొచ్చాముకదా అని నా కో

రెండు ఇడ్డెన్లూ, సాంబారూ తెప్పించుకున్నాము. రుద్రయ్య గ్లాసెడు పాలూ ఒక్క గుక్కలో తాగేసి, నాకుకూడా రెండిడ్డెన్లూ, సాంబారూ తెప్పించవా, అన్నాడు. గాయత్రీ జపం చెయ్యవలసినవాడివి, ఇడ్డెన్లు తింటానికి నోరెలావచ్చింది రుద్రయ్యా అన్నాను.

రుద్ర : కడుపేకుస్తూవుంటే నోరూరుకోగలదా భద్రయ్యా అన్నాను.

భద్ర : శాస్త్రమొప్పదు అన్నాను.

రుద్ర : వెనకటికో మహాఋషి ఆకలిఆపుకోలేక మాంసంతిని కల్లుతాగితే, దోషం రాలేదని భారతంలో వున్నట్టు విన్న జ్ఞాపకం. ఆపద్ధర్మం. ఇడ్డెన్లకి నిషేధమా భద్రయ్యా అన్నాను.

భద్ర : ఆ సమయంలో ప్రవేశించాడతను.

రుద్ర : నిరాడంబరమైన దుస్తులు.

భద్ర : (కోపంగా, రుద్రయ్యవైపు ఇహ మాట్లాడొద్దన్నట్టు చూస్తూ) నిరాడంబరమైన దుస్తులే... కాని ఆ నడక! ఆ కళ్లు! ఆ మొహం!! అతన్ని చూడగానే, ఓహో ఇతనెవరో కేవలం ఇడ్డెన్లు తిని, కాఫీ తాగిపోడానికి వొచ్చినవాడు కాదు; చూడు రుద్రయ్య అన్నాను.

రుద్ర : చూస్తున్నాను భద్రయ్యా, అన్నాను.

భద్ర : అతను లోపలికివెళ్ళిపోగానే, హోటలు యజమానిని పిలిచి ఎవరితగాడు అన్నాను... మధ్యలో నిన్ను మాట్లాడొద్దన్నాను రుద్రయ్యా! అతను ఢిల్లీనించి

వొచ్చాడు. వారం రోజులు పైగా అయింది. రెండు మాట్లు భోజనం, రెండుమాట్లు టిఫిను, నాలుగు మాట్లు కాఫీ-టీలు. అన్నీ గదికి పంపించాలి. అంతా అరువే. ఒక్క-దమ్మిడీ ఇవ్వలేదు ఇప్పటిదాకా. పొమ్మంటే పోడు. డబ్బడిగితే, ఇస్తానుండు, తొందరేమిటి! నేను గవర్నమెంటు ఆఫీసర్ని - అంటాడు అన్నాడు. ఆ ముక్క వినగానే "ఆఁ" అన్నాను.

రుద్ర : కాదు. ఆఁ అని మొదటన్నది నేను!

భద్ర : సరే సరే, నేనూ వెంటనే ఆఁ అన్నాను.

రుద్ర : అవునవును. మనమిద్దరం కూడా - (భద్రయ్యకూడా అందుకుంటాడు)

భ-రు : ఆఁ అన్నాము.

రుద్ర : ఢిల్లీనించి వొచ్చిన గవర్నమెంటు ఆఫీసరయితే వారం రోజులు ఈ వూళ్ళో ఏం చేస్తున్నాడు చెప్మా అని ఆలోచించాను. వెంటనేతట్టింది. అతనేయితను!

రాఘు : ఎవరు, ఎవరు?

భద్ర : మీ ఉత్తరంలో పేర్కొనబడిన ప్రచ్ఛన్న వేషధారి. పెద్ద గవర్నమెంటు ఆఫీసరే యితను.

నాయు: ఇనస్పెక్టర్ జెనరలా?

రుద్ర : అతనే యితను!

అందరూ గాభరా పడతారు

రాఘు : అసంభవం! అసంభవం!!!

భద్ర : సందేహం లేదు. డబ్బా యివ్వడు, పొమ్మంటే పోడు. వాడే వీడు!

రుద్ర : ఏమీ సందేహం లేదు. ఎంతతీక్షణమైన దృష్టి. భద్రయ్య తింటున్న ఇడ్లీ సాంబారుకేసి ఎలా చుర చుర చూశాడు!

భద్ర : అవునవును. నాకు భయమేసేసింది.

రాఘు : ఎన్నిరోజులనించీ వుంటున్నాడన్నావు?

భద్ర : వారం రోజులు పైగా అయిందట.

రాఘు : శివశివా! వారం రోజుల్నించీ వూళ్ళో తిరుగుతున్నాడా! రోడ్లన్నీ మురికిగుంటలు!

వెంక : హోటలికి వెళ్ళి వారిదర్శనం చేసుకుందామా?

డా.చం: నాకు గాభరాగావుంది. వెళ్ళితీరాలా?

రాఘు : వొద్దొద్దు. అన్నీ నే చూసుకుంటాను. జీవితంలో ఎన్నో సుడిగుండాలు దాటుకొచ్చాము; దేవుడు మేలు చేస్తే ఇదికూడా నెట్టుకొస్తాం. గజిబిజి చెయ్యకండి. (భద్రయ్యతో) ఎన్నేళ్లుంటాయి అతనికి?

భద్ర : చిన్నవాడే. ముప్పయ్యేళ్ళ లోపే!

రాఘు : అదీ మంచిదే. ప్రపంచానుభవం తక్కువ కనక-కుర్రాళ్ళకి నచ్చచెప్పడమే తేలిక! వయసుమళ్ళిన, ఆరితేరిన ఘటమయితే ఓదారికి తేవడం చాలాకష్టం! మీారందరూ వెళ్ళి జాగ్రత్తలు పడండి. తెలిసిందా. నేనేదో అలా యాదాలాభంగా వెళ్ళినట్టు వెళ్ళి... వొరేయ్ నారాయుడూ... బండి సిద్ధంచెయ్యి... ఏడీ ఈ పోలీసు సూపరింటెంటు. గంటకిందట రావలసింది... ఊఁ, మీరు వెళ్ళండి ... భద్రయ్యా నువ్వుండు, నాతో వొద్దువుగాని...

ఆచా : త్వరగా పదండి. ఏర్పాట్లన్నీ చేసుకోవాలి!

నాయు: డాక్టరుగారూ, మీరు రోగుల్ని కూడా సేకరించుకోవాలి. ముందర పరుగెత్తండి.

డా.చం: పరుగెత్తలేనండి— అసలే గుండె దడగావుంది. (అని స్టెతోస్కోపుతో తనగుండె చూసుకుంటాడు) రండి; రండి (అని గబగబ నడుస్తాడు, ఆచార్లూ నాయుడూ పదండి పదండి అంటూ వెంటవెళతారు)

వెంక : మనకి నిశ్చింత. మన డిపార్టుమెంటు జోలికి ఎవరూ రాలేరు. (అంటూ వెళతాడు)

తలపాగా పెట్టుకుని చేతికర్ర పట్టుకుని పోలీసు సూపరింటెంటు కోసం ఎదురుచూస్తూ, ఆలోచిస్తూ రాఘవేంద్రరావు; అటూయిటూ పచారుచేస్తాడు. అతని వెనకాల భద్రయ్యా, భద్రయ్య వెనక రుద్రయ్యకూడా ఒక్క క్షణం పచారు చేస్తారు. పోలీసు సూపరింటెంటు ప్రవేశిస్తాడు.

రాఘు : ఇంత ఆలస్యమా?

పో.సూ: బందోబస్తంతా చేసి, పరుగెత్తుకుంటూ వచ్చాను, గుండె ఎలా కొట్టుకుంటుందో చూడండి (అని ఛాతీ విరుచుకుని మీాద కొస్తాడు)

రాఘు: సరే సరే! ఏం బందోబస్తు చేశావు! ఢిల్లీనించి వాడు వొచ్చేశాడు.

పో.సూ: రోడ్లమీాద మురికి గుంటలన్నీ కంకరేసి పూడిపించమన్నాను.

రాఘు : పూడిపించడానికి ఇప్పుడు వ్యవధి లేదు. ఇంకాలోతుగా తవ్వాయ్య మను. జట్లుజట్లుగా మనుష్యుల్ని పంపించి

రోడ్లు తవ్వించెయ్యి. పెద్ద మరమ్మత్తులు చేయిస్తున్నట్టు చెప్పొచ్చు! హోటలు దగ్గిరమాత్రం అందరూ తలొక రోడ్డు పుచ్చుకొని చీపుళ్ళనీ - కాదు కాదు తలో చీపురూ పుచ్చుకొని రోడ్లన్నీ శుభ్రంగా తుడిచెయ్యమను. ఒక్క నలకకూడా కనిపించకూడదు. పోలీసు వాళ్ళకాళ్ళకి చెప్పులున్నాయా?

పో.సూ: ఉన్నాయి కానండి, కరుస్తున్నాయని వేసుకోడం మానుకున్నారు.

రాఘు : రక్తాలు కారినా, జోళ్ళు లేకుండా కనిపించకూడదు. తెలిసిందా. ఇంకో సంగతి. ఈ ఆఫీసరొచ్చి 'ఈ వూళ్ళో పరిస్థితేమిటి? ఆఫీసర్లందరూ సంతృప్తిగా ప్రవర్తిస్తున్నారా లేదా' అనిగనక అడిగితే ఏక కంఠంతో 'అంతా చాలా బాగుంద'ని చెప్పాలి. లేకపోతే డొక్క బద్దలు కొట్టించేస్తాను. తెలిసిందా?

పో. సూ: వెంటనే దండోరా వేయించేస్తాను.

రాఘు: వెర్రి కుదిరింది; రోకలి తలకి చుట్టమన్నాట్ట. వాడు వినేటట్టు దండోరా వేయిస్తావా? నా ఖర్మం. ఎలాంటి శనిగాళ్ళు దొరికారురా నాకు (కర్రతో బెదిరిస్తూ వుంటే కర్ర కింద పడిపోతుంది) పోలీసుల్ని యింటింటికీ వెళ్ళి చెప్పి రమ్మను.

పో. సూ: అలానేనండి.

రాఘు: ఇంకా నిలుచున్నావేం! బందోబస్తుచేసి మళ్ళీ అర గంటలో కనిపించు.

పో. సూ: ఓ. (అని పరుగెడతాడు.)

రాఘు: ఈ గండం గడిచి బయటపడితే, ఆంజనేయస్వామికి వెయ్యి కొబ్బరికాయలు కొడతాను. భద్రయ్యా! ఒక్కొక్క దుకాణం దగ్గిర్నుంచి పదేసి కాయలు వసూలుచెయ్యి! నారాయుడూ, తయారయిందా బండి ('సిద్ధంగా వుందండి' అని లోపలినించి జవాబు వినిపిస్తుంది) నా చేతికర్ర! (భద్రయ్య చేతికర్ర అందిస్తాడు) తలపాగా!

భద్ర: తలపాగా తమ తలమీదే వుందండి!

రాఘు: (తడివి చూసుకుని) అవునవును. తలమీద తలపాగా వుంది. తలలో మెదడుంది! మెదడు పనిచేస్తే ఇదో ప్రమాదమా? పద భద్రయ్యా!

రుద్ర: నేనూవొస్తాను-తీసుకెళ్ళరూ?

రాఘు: వీల్లేదు. బండిలో చోటు లేదు.

రుద్ర: ఇరుక్కుని కూచుంటాను. పోనీ బండీపట్టుకు వెనకాలే పరుగెడతాను! లోపలికి రాను. పైనించి తలుపు కంతలోంచి చూస్తాను!!

రాఘు: పనికిరాదు. నువ్విక్కడ కూచుని గాయత్రీ జపం చెయ్యి. నడు భద్రయ్యా (ముందు రాఘువేంద్రరావు గారూ, వెనక భద్రయ్యా వెళ్ళిపోతారు.)

రుద్రయ్య సోఫామీద మఠం వేసుకు కూచుని, కళ్ళు మూసుకుంటాడు, గాయత్రీ జపం ప్రారంభించడానికి. కాని ఉబలాటం ఆగదు. లేచిపోతాడు.

రుద్ర: రోడ్డుమీదే మనసులోనే గాయత్రీ జపం చేసేస్తాను (అని పరుగెడతాడు బయటికి)

తెర.

# రెండో అంకం

శ్రీ సీతారామాంజనేయ కాఫీ, లాడ్జింగ్ అండ్ బోర్డింగ్ హౌస్‌లో ఒక చిన్నగది. ఒక మంచం, చిన్న టేబులు, ఓ చేతుల్లేని కుర్చీ వుంటాయి. మంచంమీద హోల్డాలుతో సహా పక్కపరిచి వుంటుంది. తెర లేచేసరికి రామచంద్రయ్య, నౌకరు నరసన్న మాట్లాడుకుంటూ వుంటారు.

నరసన్న: ఆకల్తో పొట్ట పీక్కుపోతోంది. ఈ పూట వోటల్లో తిండి దొరికేటట్టు లేదు. అయ్య సేతిలో డబ్బులేదు. డబ్బిత్తేనేగాని ఈరోజు తిండి నేదంటాడు, వోట లాయన! ఏం గహచారం. అయ్యా తిన్నగా యింటికి పోదాం అని పోరితే యిన్నాడు కాదుగదా! దేశా టనం చెయ్యాలన్నాడు, దేశాటనం. మద్దె మద్దిన పేకాట. ఎప్పుడూ చవరమేగాని ఒక్కనాడూ గెలుచు కోలేడు. సేతిలో డబ్బంతా అయిపోయింది. అయినా యేసాలుమాన్డు. ఎక్కణ్ణో తన్నులు తింటేకాని బుద్దిరాదు కామోసు బగవంతుడా! నానేం జేసేది! ఆడెట్టాపోతే నాకేం, నాపాణానికొచ్చిందే! పెద్దయ్య గోరేమో యెంటుండి లగెత్తుకు తోలుకురమ్మన్నారు. ఈ బాబు రాకుండా నే యింటికెడితే పెద్దయ్యగోరు నన్ను దంచేత్తారు. ఈన యెంటుంటే యిక్కడే యీపు పగిలేలాగుంది. ఏందారి! యీనౌకరీ వొదిలి పెట్టి పారిపోతేనే మంచిది లావుంది. (అని రెండడుగు లేసి) ఆకల్తో పాణాలు పోతూంటే యెట్టా పారిపోయేది! (వెళ్ళి రామచంద్రయ్య మంచంమీద కాళ్ళ దగ్గర

దన్నీ పడుకుంటూాడు. కళ్లు మూసుకుంటాడు; అటూ యిటూ దొల్లుతాడు. లేచి మంచంమీదే కూచుని) ఏం మనిసంట! నేతితో డబ్బుంటే యెనకాముందు సూడ్డు, ఒకటేకక్కు! సంపించినవన్నీ కొనేత్తాడు. అదే ఓతులు అటే బాబు! డబ్బయిపోతే, కట్టుకున్న బట్ట దగ్గిర్నించీ అమ్మేత్తాడు. యెట్టా బాగుపడు తాడంట. యెందుకీ నట్టం! యింటికాడ పొలం సూసుకుంటూ కూకోకూడదూ. ఢిల్లీలో వుద్యోగం చేత్తాను. పెద్ద ఆఫీసరవుతుందని పరుగెత్తె. అక్కడేమో గుమాత్తా పనిగాని దొరకలేదయ్యె! యెప్పుడో ఆఫీసరవుతుంది, ఇప్పట్నించే ఆఫీసర్లా యేసాలెయ్యాల! సొమ్ము పంపించమంటే పెద్దయ్యగోరు పంపిత్తారా! ఆ యెదవ ఉద్దోగంచెయ్య కర్లే, యింటికొచ్చెయ్ అని యెన్ను ఉత్తరాలు రాసినా రాకపోతే తోలుకురమ్మని నన్ను పంపించి రమ్మె! మంచి సంబందం చూసి పెళ్ళిచేసి పొలం దున్నిత్తానంటాడు పెద్దయ్యగోరు. యింటాడా ... అయినా ఢిల్లీలో ఓతుచేసినోడికి పల్లెటూరేం పని కొస్తుందంట! యేం పట్నమండి ఢిల్లీ. యెంతూరు. యెన్ని మేడలు!! ఎంతందమైన ఆడోళ్ళు, గుమత్తా వుద్యోగమే ఆయిరి. ఢిల్లీ యిడిచి రమ్మంటే వొత్తాడా యీ బాబు. యీ బాబేటి, ఓ మాటు మాసినాక, నాకు మాత్రం వొదలా లనిపించిందా! అక్కడికే పోయి నౌకరీ సేసుకుంటూ. సిగరెట్టు నమ్ముకీల్చుకుంటూ సాయింతరం బజార్లో తిరుగుతూంటే,

నా సామి రంగా... (లేచి టేబిల్ మీద వున్న గోల్డు ఫ్లేకు సిగరెట్టు డబ్బా తీస్తాడు. అందులో ఒక్కటే సిగరెట్టుంటుంది. తీసి చూస్తాడు) గోల్డుఫ్లేకు టిన్ను! లోపల చార్ మినార్ సిగరెట్టు! వారెవా పట్టణం యేసం! (సిగరెట్టు ముట్టించి, పక్కమీద పడుకుని పైకి పొగ వొదుల్తూ) లోపల యేటుంటె యేటి! బయట యేసం సోగ్గావుండాలి.

పైనించి కూనిరాగం వినిపిస్తుంది.

వొస్తున్నాడురా బాబూ (గబుక్కుని మంచంమీంచి లేచి సిగరెట్టు నేలకి పెట్టి ఆరిపేస్తూ వుండగా "మద్భుజార్జిత ధారుణీ మండలంబు" అని కూనిరాగం తీసుకుంటూ రామచంద్రయ్య ప్రవేశం. కోటుతీసి విసుర్తాడు. పట్టుకుందామని నరసన్న ప్రయత్నంచేస్తాడు గాని అది కిందపడి పోతుంది. తీసి దులుపుతాడు. మంచంమీద కూచోడానికి రామచంద్రయ్య వెళ్ళి, పక్క నలిగిపోడం చూసి)

రామ: నరసన్నా, శయ్యమీద తిరిగి పవళించావు?

నర : ఏటి బాబూ!

రామ: నాపక్క మీద మళ్ళీ పడుకున్నావు.

నర : మీ పక్కమీదా! నేనా! ఇంగోళ్ళ పక్కలో నే నెందుకు పడుకుంటాను బాబూ!

రామచంద్రయ్య సిగరెట్టు కోసం టిన్ను తీస్తాడు. సిగరెట్టులేదు.

రామ : నరసన్నా నా సిగరెట్టుకూడా కాల్చేశావు?

నర : మీ సిగరెట్టు నే నెందుకు కాలుత్తాను; చుట్టలు కాల్చుకునేవోణ్ణి. నాకు సిగరెట్టేం ఆనుతుంది బాబూ!

రామః: ఓ చుట్టముక్క ఇలా పారెయ్. చిదిపి సిగరెట్లు కట్టు కుంటాను.

నర : చుట్టముక్కేది బాబూ, నాల్రోజులయింది కాల్చి. కొనుక్కుందా మంటే సేతిలో దమ్మిడీ నేదు.

రామః: ఇలారా! (నరసన్న దగ్గరకొస్తే మొహంవాసనచూసి) నువ్వు కాల్చేశావు! నా ఆఖరి సిగరెట్టు.

నర : అబద్ధం బాబూ! నాల్రోజుల్నాటి చుట్టవాసన-

రామః: చేసిన అపరాధాలు కాక, నేను అబద్ధమాడానని బుకాయింపా! తిండి ఎక్కువయింది కాబోలు.

నర : ఏం మాట బాబూ! ఆకలేసి సస్తూంటే!!

రామః: జ్ఞాపకం చేశావు, భోజనానికి టైమయి నట్టుంది. (గదిలో పచారుచేస్తూ, సముదాయించే ధోరణిలో) నరసన్నా ...

నర : బాబూ.

రామః: నువ్వెళ్ళి ...

నరస : ఎక్కడికి బాబూ!

రామః: కింద హోటల్లో భోజనాలు పెట్టేచోటికి ... వెళ్ళి ... నాకు వెంటనే భోజనం పంపించమని చెప్పు!

నర : నేనా? నే వెళ్ళను!

రామః: వెళ్ళవు? ఆజ్ఞ అతిక్రమిస్తే సహించి పూరుకోను సుమా! వెళ్ళు.

నర : నే వెళ్ళను... వెళ్ళి లాభంలేదు బాబూ. మీ కింక భోజనంపంపించొద్దని యజమాని ఇందాక నేచెప్పాడు.

రామః: భోజనం పంపించడూ! పంపించకుండా వుండడానికి వాడెవడు?

నర : నానా మాటలన్నాడు. 'నువ్వూ నీ యజమాని కలిసి చెడ మేస్తున్నారు. ఇదంతా చూస్తే ఏదో మోసంలా వుంది. వారం రోజులయింది- ఒక్కడమ్మిడీ రాలేదు. కాని యిలాంటి మోసగాళ్ళని యిదివరకు లక్షమందిని చూశాను. నా దగ్గిర యీ జిత్తులింక సాగవు' అన్నాడు.

రామ: యిదంతా నాదగ్గిర యేకరువు పెట్టడానికి సిగ్గు లేదూ?

నర : ఇంకా యినండి. ఇయ్యాళ డబ్బివ్వకపోతే పోలీసు సూపరిండెంటుకి ఫిర్యాదుచేసి జైల్లో పెట్టిస్తానన్నాడు!

రామ: యేడిశాడు! డబ్బుకేమిటి వెధవడబ్బు. యిచ్చిపారేస్తాం వీలుచూసుకు, ఇప్పుడు మాత్రం వెంటనే భోజనం పంపించమను. లేకపోతే పిలక ఎక్కడేకేస్తాను. ఊఁ. వెళ్ళి నే చెప్పానని చెప్పు.

నర : మీరే యెళ్ళి సెప్పండా మాట.

రామ: నాన్నన్ను! నౌకరువి, నువ్వే వెళ్ళాలి.

నర : యజమాన్నిక్కడికి పిలుచుకొద్దునా?

రామ: పనికిరాదు. వెళ్ళమంటూంటే! (నరసన్న కదలడు. జబ్బ పట్టుకుని స్వరంమార్చి, కొంచెం బతిమాలిన ధోరణిలో) వెళ్ళిచెప్పిరా, నరసన్నా వెళ్లు (నరసన్న గొణుక్కుంటూ, బుర్ర గోక్కుంటూ వెళతాడు) చాలా ఆకలేస్తోందిరా నరసన్నా! కాస్త అలా తిరిగొస్తే ఆకలి అణిగిపోతోందేమోనని చూశానుగాని కడుపులో ఒకటే రొద! ఆ ముండాకొడుకు పేకాట్లో నన్ను మోసంచేసి గెలుచుకోకపోతే కడుపునిండా తిని యింటికి పోడానికి డబ్బుండును కదా!. మళ్ళీ

వాడు రానీ, రెండింతలు రాబడతాను. అయినా ఛీ ఛీ వెధవ్వూరు. ధారాళంగా అప్పివ్వడాని కేడుస్తారు. 'అప్పిచ్చువాడు లేని ఘూర దూరొద్దని' అదేదో శతకం రాసినవాడు ఎప్పుడో చెప్పాడు. ఏం తెలుస్తుంది. పై నుంచి చూసి మంచివూరే అనుకున్నా... 'ఉప్పు కప్పురంబు ఒక్కపోలికనుండు...' ఇక్కణ్ణించి బయటపడ్డం ఎలాగో ఆలోచించాలి. (ఆలోచించినట్టు కాస్సేపు తలపట్టుకు కూచుంటాడు.) కడుపులో కామన్న గంతులేస్తూవుంటే, బుర్రేం పనిచేస్తుంది... నరసన్నా వెళ్ళి చెప్పిరారా. అక్కడే పాతుకుపోయాడేం!

హోటలు నౌకరు లక్ష్మణస్వామి లోపలికొస్తాడు.

లక్ష్మ: మీ కేంకావాలో కనుక్కురమ్మన్నాడండి మా యజమాని.

రామ: రా, రా! కులాసాగా వున్నావా ?

లక్ష్మ: ఆఁ

రామ: మనవాళ్ళంతా ఎలావున్నారు? ఇంటిదగ్గర కుశలమేనా ?

లక్ష్మ: (ఈ ధోరణి అర్థం కానట్టు) ఆఁ

రామ: హోటల్లో వంటంతా అయిపోయిందా ?

లక్ష్మ: ఎప్పుడో అయిపోయింది !

రామ: చాలా సంతోషం! చూడు, నీ పేరేమిటి ?

లక్ష్మ: లచ్చనస్వామి

రామ: శభాష్. నా పేరు రామచంద్రయ్య. మనమిద్దరం అన్నదమ్ముల వరస, తెలిసిందా ?

లక్ష్మి: (తెల్లబోయి) ఆఁ

రామ: అవునా! అన్నగారి భోజనం ఇంకా పైకి రాలేదు తమ్ముడూ! వెళ్ళి త్వరలో పంపిచేస్తావూ. భోజన మయిన తరవాత భుక్తాయాసం తీరగానే అర్జెంటు పని చేసుకోవాలి.

లక్ష్మి: అరువుమీద మీకింకేమీ ఇవ్వొద్దని యజమాని ఆర్డరేశాడండి. పోలీసుకి ఫిర్యాదు చెయ్యడానికి బయలుదేరుతున్నాడు.

రామ: అరెరె! ఫిర్యాదు చెయ్యడమెందుకు? తమ్ముడూ నువ్వే ఆలోచించు. నేనేం చెయ్యగలను. ఇప్పుడు, భోజనానికి టైమయిపోయింది. తిండి పడాలా? చూడు. నా కడుపు చూడు ఎలా ఏడుస్తోందో! వెంటనే భోం చెయ్యాలి! లేకపోతే కాళ్ళూ చేతులూ విలవిల్లాడి పోతాయి. ఆకలి దహించుకు పోతోంది. అన్న శాంతి కావాలి!

లక్ష్మి: నిజమేనండి. కాని తిన్నవాటికి డబ్బిస్తేనేగాని ఇహ భోజనం పెట్టనన్నాడు యజమాని. నేనేం చెయ్యను!

రామ: అదిచాలా తప్పని మీ యజమానితో వాదించు; నచ్చచెప్పు!

లక్ష్మి: ఏమని వాదించను; ఎలా నచ్చచెప్పను?

రామ: నేను భోజనం చెయ్యక వీల్లేదని చెప్పు. తను దుండు ముక్కలా వున్నాడు; ఓరోజు తిండి లేకపోయినా ఫరవాలేదు కనక, నాసంగతీ అలానే అనుకుంటు న్నాడు కాబోలు. మనకి టైము ప్రకారం తిండి

పక్షాలి! లేకపోతే అసలేము. వెళ్లు తమ్ముడూ; నీ వాగ్ధాటి అంతా ప్రయోగించు.

లక్ష్మ: చెప్పి చూస్తాను. (అని వెళతాడు)

రామ: తినడానికి నిజంగా ఏమీ పంపించకపోతే గత్యంతరం! కొత్తగా కుట్టించుకున్న సూటు చలామణీచేసి కడుపు నింపుకుందునా? మన కదొక్కటపుంచి సూటే మిగిలింది కదా, దాన్ని వొదులుకుంటే మన పేరు ప్రతిష్ఠలు నిలుపుకోడం ఎలా? ఓరోజు వస్తుండడమే మేలు. రామచంద్రా ఎంతగతి పట్టిందిరా నీకు. అన్నమో రామచంద్రా అని అందరూ నిన్ను వేడుకోడంపోయి రామచంద్రా, నువ్వే అన్నానికి అలమటించవలసి వొచ్చింది కదా? (నాటకపు పోజు పెట్టి) ఎంత దుర్గతి! ఎంత వైపరీత్యము! సూర్య చంద్రులారా, ఈయ న్యాయమును సహించి యూరకుందురా! భూమ్యాకాశములారా, మీరేల ఏకము కారు! కామధేనూ నీ కేల కరుణకలిగి నా కడుపు నింపవు! లేదేని, ఓ యమధర్మరాజా, నీవేల నా ఆకలిని చంపవు! (ఒక్క క్షణమాగి) కలికాలం? నాగోడు వాళ్ళేంవింటారు— మనుష్యులకే కాతరు లేకపోతే!

నరసన్న లోపలి కొస్తాడు

ఏమంటాడు?

రామ: పంపిస్తున్నాడు.

రామ: (ఎగిరి గంతేస్తూ) 'వొస్తుందీ భోజనమూ; పడుతుందీ కడుపులో...'

లక్ష్మణస్వామి కంచంలో పెట్టి భోజనం తీసుకొచ్చి టేబిల్ మీద పెడతాడు

లక్ష్మి: ఇది ఆఖరిమాట! ఇంకేమీ యివ్వనన్నాడు యజమాని.

రామ: యేడిశాడు మీ యజమాని. చూపిస్తాను వాడికి నా తడాఖా. మొదట యిదీ నా కడుపులో పడనీ...

ఆదుర్దాగా వెళ్ళి కుర్చీలో కూచుంటాడు. ఆ కంచంలో ఒక సాసరులో పెట్టి కొంచెం అన్నమూ, ఒక కప్పులో సగానికి చారూ, మరో కప్పులో సగానికి మజ్జిగా వుంటాయి.

రామ: పదార్థాలేమీ కనిపించవేం?

లక్ష్మి: అవే యిచ్చారు. అన్నం, చారూ, మజ్జిగ!

రామ: కూర, పులుసు ఏవీ?

లక్ష్మి: లేవండి.

రామ: ఎందుకు లేవూ? రాసెడు కూరా, గంగాళం పులుసు చూశాను, యిందాక.

లక్ష్మి: లేవంటే... అసలున్నాయండి. మీకు లేవు!

రామ: ఎంచేత!

లక్ష్మి: అవి డబ్బిచ్చిన వాళ్ళకేనండి!

రామ: డబ్బున్న వారికే కూరా పులుసూ! ఔరా ధన మధాంధత! ధనిక వర్గపు దోపిడీ విధానం! దోపిడీ విధానం నశించాలి! విప్లవం వర్ధిల్లుగాక! పీడిత ప్రజల కడుపు నిండుగాత! (భోజనానికి ఉపక్రమించబోతాడు. సాసరు ఎత్తి చూపిస్తూ) ఇంతే అన్నం!

లక్ష్మి: అంతేనండి!

రామ: ఆకలితో వున్న నా కడుపేమిటే? ఈ పిసరంత అన్న మేమిటి? నవ్విపోతాడు ఎవడైనా వింటే! నాకెలా సరిపోతుందనుకున్నాడు.

లక్ష్మ: ఇదే ఎక్కువన్నాడండి
రామ: బిచ్చమేస్తున్నా ననుకున్నాడేమిటి! పిడికెడు మెతుకులు. ఛీ ఛీ నాకక్కర్లేదు.
లక్ష్మ: తీసుకుపోనా? అక్కర్లేకపోతే తీసుకొచ్చెయ్యమన్నాడు (అని దగ్గరికి వెళతాడు.)
రామ: (చేతులు అడ్డంపెట్టి) దూరంగావుండు. సిగ్గులేదూ! తెచ్చిన భోజనం తీసుకుపోవడానికి. (మళ్ళీ సాసరు ఎత్తి పట్టుకుని)

'పన్నెండు దేశాలు, పండుచున్నవిగాని,

పట్టెడన్నమె లోపమండీ!'

స్వారాజ్యమొచ్చినా, ఇలానే యేడుస్తోంది . . . చారూ, మజ్జిగా. చారూ అన్నంతిని మజ్జిగ తాగడమా చారుతాగి మజ్జిగ అన్నం తినడమా? (చారు రుచి చూస్తాడు) ఛీ ఛీ రుచీ పచీ లేదు. (మజ్జిగ తాగుతాడు) మజ్జిగలో నీళ్ళు పోశారా; నీళ్ళలో కసింత మజ్జిగ పోశారా? (అన్నంలో కొంచెం చారు కలిపి ఓముద్ద నోట్లో పెట్టుకుంటాడు) పొరలోబడతుంది. మింగలేక ఉక్కిరి బిక్కిరి అవుతాడు)

'ఉడికీ ఉడకని అన్నము,

కాటోయిన కందిపప్పు, కాగని చారున్. . .'

రామచంద్ర! ఎలా చేస్తావయ్యా యీ భోజనం! నరసన్నా! నువ్వు తీసుకుపో (నరసన్న ఆశపడి ముందుకొస్తాడు) వొద్దొద్దు ఎంగిలి చేశాను. (గబగబ మిగిలిన అన్నం తినేసి, చారూ, మజ్జిగా తాగేస్తాడు)

కష్టాలన్నీ బోర్లించేస్తాడు. నరసన్న తెల్లబోయి చూస్తావుంటాడు. ఇంకేం లేదా!

లక్ష్మి: లేదు.

రామ: కడుపులో ఏమీ పడినట్టే లేదు. ఇంకా అలోలక్ష్మణా అని ఏడుస్తోంది. ఒక్కమాటు కింద కెళ్లి చూసిరా... ఏమైనా దొరుకుతుందేమో!

లక్ష్మి: కాళ్ళిరగేస్తాడు యజమాని. ఇంకేమీ దొరకదు!

కంచం తీసుకుపోతాడు

రామ: నన్నాకలితో వుంచుతారుగా! అనుభవిస్తారులే... నరసన్నా, నువ్వూ కిందకిపోయి కడుపు నింపుకో! (నరసన్న వెళ్ళిపోతాడు) ఈ వ్రాళ్లోఇహ మనప ప్పుడ కదు! దేహశుద్ధికూడా జరగొచ్చు, గిరీశం గారికి పట్టిన అవస్థే మనకీ పట్టింది. ఆయన చెప్పినట్టు శీఘ్రంగా యిక్కణ్నుంచి బిచాణా యెత్తివెయ్యడమే బుద్ధికి లక్షణం! మనకీ ఓ శిష్యుడు వెంకటేశం ఏల దొరకకూడదు! బుచ్చమ్మ కూడ ఏల తటస్థపడరాదు!!

నరసన్న పరుగెత్తుకొస్తాడు

నర : ఆఫీసర్లొచ్చి కింద మీకోసం వాకబు చేస్తున్నారు.

రామ: (భయపడుతూ) నాకోసమా! ఎందుకూ? గాడిద కొడుకు అప్పుడే ఫిర్యాదు చేశాడా ఏమిటి! నిజంగా జైల్లో పెట్టించేస్తాడు కామోసు! ఛా లే... భయపడకు రామచంద్రా, భయపడకు. మనదేశనాయకు

లందరూ జైల్లో వుండొచ్చిన వాళ్ళేగా! ఎ క్లాసిస్తే హాయిగా వెళ్ళి రావొచ్చును... ఊహూ, నేవెళ్ళను. నేనెవరనుకుంటున్నాడో.. గుండా చెరువా, నన్నిలా చెయ్యడానికి! (ధీమాగా) వెళ్ళి అడిగేస్తాను. ఎవడ్రా నువ్వు... నేనెవరనుకుంటున్నావు? (తలుపు తెరుచుకుని రాఘవేంద్రరావూ, భద్రయ్యా లోపలికొస్తారు. రామచంద్రయ్యని చూసి రాఘవేంద్ర రావూ, రాఘవేంద్రరావుని చూసి రామచంద్రయ్య గాభరా పడతారు.)

రామ: (ఝుంకుసుకున్నట్టు) నే...నె...వరి .. (ఒకరి నొకరు తేరిపార జూసుకుంటూ వుండిపోతారు ఓ క్షణం. అనుభవశాలిగనక రాఘవేంద్రరావు మొదట తేరుకుంటాడు.)

రాఘ: (నమస్కారం పెడుతూ) క్షేమమా?

రామ: (ప్రతి నమస్కారం పెడుతూ) తమరు...

రాఘ: క్షమించాలి, అనుమతి లేకుండా లోపలి కొచ్చినందుకు—

రామ: (తెల్లబోతూ) ఫరవాలేదు.

రాఘ: నే నీవూరి మేజస్ట్రీటుని... హోటళ్ళలో దిగే ప్రయాణికులకీ, పెద్దమనుష్యులకి, ఏమీ ఇబ్బందులూ, మోసాలూ...

రామ: (మోసం అనేమాట వినేసరికి చాలా గాభరాపడిపోతాడు) మోసం.... నేనేమీ....చెయ్యలేదు....నా తప్పేమీ లేదు. .నిజంగా యిచ్చేద్దామనే అను

కుంటున్నా (నసుగుతూ ప్రారంభించాడు. కాని ఇప్ప టికి ధైర్యమొచ్చింది. దబాయించి చెబుతాడు) ఇంటి దగ్గిర్నించి సొమ్మొస్తుందని చూస్తున్నాను. (గుర్రయ్య పైనించి తొంగిచూసి మళ్ళీ వెనక్కి పోతాడు) వాడిదే అసలు మోసం! అన్నం పెడు తున్నాడు చూడండీ, మేకుల్లాటి మెతుకులు గంజి నీళ్ళలో చింతపండేసి, చారూ పులుసూ అంటాడు. ఇప్పుడిప్పుడే పారబోసేశాను వాడి చారు... రోజుల తరబడీ నాకు తిన్నని తిండిపెట్టక చంపుతున్నాడు. టీ కాఫీలు చెప్పనే అక్కర్లేదు, కుంకుడుకాయనీళ్లు... నేనెందుకు ఇవ్వాలంట! ఇలాటి మోసం సహించను!

రాఘు: (తనమీద ఎదురు తిరిగిందని భయపడుతూ) క్షమిం చాలి... క్షమించాలి. అలాటివేమీ చెయ్యకూడదని రూల్సున్నాయి. రూల్సుకి వ్యతిరేకంగా నడచిన వారికిదండన తప్పదు (దండనఅనేసరికి రామచంద్రం గాభరాపడతాడు) ఆ సంగతంతా క్షుణ్ణంగా విచారణ చేయిస్తానుగాని ... తమరు నాతో మరో చోటికి రాకూడదూ ?

రామ: రాను రాను నే ఎక్కడికీ రాను. మరో చోటంటే నాకు తెలీదనుకున్నావా, జైలు! నాకా మాట చెప్ప డానికి నీకేం హక్కుంది. ఎంత సాహసం! నేనేం అల్లాటప్పా మనిషి ననుకుంటున్నావా! నేను... ఢిల్లీలో ... గవర్నమెంటు ... (అని ఎలా పూర్తి చెయ్యాలో తెలీక చేతులు తిప్పుతాడు)

రాఘు: (భద్రయ్యతో రహస్యంగా) ఎంత కోపంగా వుంది! వెధవ లెవరో... మనమీాదప్పుడే చాడీలు చెప్పే సుంటారు.

రామ: (రాఘువేంద్రరావు తటపటాయించటంచూసి, ఇంకా బుకాయింపుతో) నేరాను. నీపోలీసు ఫోర్సునంతా తెచ్చినా కదలనంటే! ఆ. ప్రైమినిష్టర్‌కి వెంటనే ఉత్తరం రాసేస్తాను (బల్లగుద్ది) అసలు ఎవరునువ్వు? ఎవరిపంట ?

రాఘు: (గడగడ వొణుకుతూ) చి త్తం. చిత్తం కరుణించాలి. పెళ్ళాం పిల్లలూ వున్నారు .. దయదలచాలి...

రామ: నే దయ దలచను. నాకేం పట్టింది? నీకు పెళ్ళాం, పిల్లలూ వున్నారని నే జైలుకెళ్ళి కూచోనా? ఏం సబవు (గట్టిగా అరుస్తూ) వీల్లేదు. (రుద్రయ్య ఓమాటు లోపలికి తొంగిచూసి మళ్ళీ వెనక్కి పోతాడు) నే ఒప్పుకోను !

రాఘు: అపరాధం జరిగిపోయింది. ప్రమాణ పూర్తిగా చెబుతున్నాను.

రామ: డబ్బుకి డబ్బా పుచ్చుకుని...

రాఘు: (డబ్బు పుచ్చుకోవడమంటే తను లంచాలు పుచ్చు కోడమనుకుని, ఇంకా వొణుకుతో) నమ్మకండి... నమ్మకండి. ఎవరో కిట్టని వెధవలు చెప్పుంటారు. లంచాలన్నమాట నాదగ్గిర వినపడనివ్వను!

రామ: (లంచం ఇస్తే వొదిలిపెడతానని రాఘవేంద్రరావు సూచనచేశాడనుకుని) లంచాలివ్వడానికి నాదగ్గిర సొమ్మేమీలేదు ప్రస్తుతం! హోటలువాడికే ఇవ్వడానికి లేకుండావుంటే... హోటలువాడికి తప్పకుండా డబ్బిచ్చేస్తాననుకోండి... కాని ఇప్పుడు చేతిలో చిల్లిగవ్వలేదు. చిల్లిగవ్వ! అందుకేగా ఇక్కడ దిగడిపోయి ఈ చిక్కులో పడ్డాను.

రాఘ: (కొంచెం తేరుకుని, భద్రయ్యతో) ఎంతజిత్తులమారి! ఏం కావాలో తెలీనివ్వడం లేదుకాని, డబ్బుకి కతికే టట్టేవుంది. అటునించి నరుక్కొద్దాం. (రామచంద్రయ్యతో) మీదగ్గిరసొమ్ము తక్కువయితే నేనున్నానుగా... ప్రయాణీకులు ఇబ్బంది పడకుండా చూడ్డం నావిధి... సొమ్మేమైనా కావలిస్తే...

రామ: అప్పిస్తారా యేమిటి. హోటలు యజమాని గాడికి యిచ్చి పారేస్తాను... ఓ రెండొందలిప్పిస్తే... అహా ఓ వందయినా ఫరవాలేదు.

రాఘ : (నోట్లకట్ట చేతికిస్తూ) సరిగ్గారెండొందలరూపాయలు. మళ్ళీ లెక్కెట్టక్కర్లేదు.

రామ: (సొమ్ము జేబులోపెట్టుకుంటూ) థాంక్స్! ఇంటికెళ్ళగానే తిరిగి పంపించేస్తాను. జరుపులు పెట్టనులెండి, భయపడొద్దు. నే అలాటివాణ్ని కాను... మీరు కూడా... చాలా మంచివారిలా... కనిపిస్తూనేవుంది.

ఏమిటి కథ, కనూమిషు .. వాతావరణమే మారి పోయింది! శలవిప్పండి.

రాఘు : (భద్రయ్యతో) ఒతికిపోయాం. డబ్బు తీసుకు జేబులో పెట్టుకున్నాడు... ఇహనించీ వ్యవహారం చల్లగానడుస్తుందనుకుంటా. ఎందుకైనా మంచిదని, నిజానికి నాలుగువందలు చేతిలో పెట్టాను. రెండొందలు కాదు!

భద్ర : (రాఘవేంద్రరావుతో) ఇహాభయం లేదు. మీ లౌక్యానికి తట్టుకోగలడా !

రామ: నరసన్నా! నరసన్నా! (నరసన్న పరుగెత్తుకొస్తాడు.) ఆలక్ష్మణస్వామిని పిలుచుకురా(నరసన్న వెళ్ళిపోతాడు) అరెరె. నించునేవున్నారే. కూచోండి... కూచోండి.

రాఘు: ఫరవాలేదు. ఫరవాలేదు.

భద్ర : మేం నించుంటేనే బాగుంటుంది.

రాఘు: తమరు కూర్చోండి!

రామ: అదేమన్నమాట! (మంచంమీద కూర్చుని) మీరూ కూర్చోండి. మీరెంత ఘరానా మనుష్యులు...ఎంత మర్యాదస్తులు... నేనేమిటో అనుకున్నా...నామీదే మైనా... ఎలాటి పొరపాటు. ఊఁ కూచోండి. కూచుని తీరాలి.

రాఘవేంద్రరావు కుర్చీలోనూ, ప్రక్కనున్న బల్లమీద భద్రయ్య కూర్చుంటారు.

రామ: (కాలీటిన్ను చేతిలో పట్టుకుని) సిగరెట్టు కాలుస్తారా ఏమిటి?

రాఘు: వొద్దొద్దు.

రామ: వూళ్ళో అంతా కుశలమేనా?

రాఘు: (భద్రయ్యతో) చూశావా! వూళ్ళో అంతా కుశల మాట! తను మారువేషంలో వున్నట్టు మనంకనిపెట్ట లేదన్నట్టేనటిస్తున్నాడు. మనమూఅలాగేనటిద్దాము. (రామచంద్రయ్యతో) ఓ .. నేనూ భద్రయ్యా... భద్రయ్య ఈ వూళ్ళో ఆంజనేయస్వామి వారిఆలయం ధర్మకర్త. అలా వెళుతో వెళుతూ.. హోటల్లో ప్రయా ణీకులు, వాళ్ళుఎవరైనా దిగారేమో... వారి యోగ క్షేమాలు కనుక్కుని పోదాం! అని లోపలి కొచ్చాం. ఈవూరి ప్రజల బాగోగులు అలా కనిపెడుతూ వుండ డం నాపరిపాటి! ఆఫీసులో కూచున్న అరఘడియు గంటలేకాదు. నాకు ఎప్పుడూ ఇదే చింత! ప్రజలు ఎలా సుఖంగా వుంటారు! నే నెప్పుడూ ఓ గొప్ప ఆఫీసర్నని అనుకోను. ప్రజాసేవకుణ్ణే అనుకుంటా. నా అదృష్టం పండింది. ఈ రోజున మీ పరిచయు భాగ్యం కలిగింది.

రామ: ఎంతమాట శలవిచ్చారు! నాకూ చాలా ఆనందంగా వుంది. మీరు రాకపోతే ఏమయ్యే వాణ్ణనుకున్నారు! ఇక్కణ్ణించి పోడానికి వీల్లేదు; ఉండడానికి వీల్లేదు! హోటలువాడికి బిల్లు చెల్లించాలి; ఎలాగో తెలియుదు!

రాఘు: (భద్రయ్యతో) కోస్తున్నాడు. బిల్లు ఎలా చెల్లించడమో తెలీదుట! మానాయన. నోట్లో వేలెడితే కరవలేడు!(రామచంద్రయ్యతో)అడిగానని ఏమీ అనుకోవద్దు. ఎక్కడెక్కడ తిరిగొస్తున్నారు; ఎక్కడికి వెళ్దామనుకుంటున్నారు.

రామ: ఢిల్లీనించి బయలుదేరాను. మనవూళ్ళు నాలుగూ చూసి మా వూరెళ్ళిపోతున్నాను.

రాఘు: (భద్రయ్యతో) గడుసువాడు. ఓ పట్టాన తేలడు. జాగ్రత్తగానే వుండాలి వీడితో. చేతిలో పడ్డాడని ఆదమరిచివుండకూడదు.(రామచంద్రయ్యతో)మనవూళ్లు నాలుగూ చూడ్డం చాలా మంచిదిలెండి. ఇంటికి విశ్రాంతికోసం శెలవమీద వెళుతున్నారా ఏమిటి?

రామ: లేదండీ (లేచి పచారు ప్రారంభిస్తాడు. రామచంద్రయ్య లేవగానే రాఘువేంద్రరావు, భద్రయ్య కూడా లేచిపోతారు. పెద్ద ఆఫీసరు నించుని వుండగా మిగతా వాళ్ళు కూచో కూడదన్నట్లు ఈ సీను చివరదాకా, రామచంద్రయ్య కూచుంటే రాఘువేంద్రరావు, భద్రయ్యలు కూచోడం అతనులేస్తే, తామూ లేస్తూ వుండడం చేస్తారు.)

నే ఢిల్లీలో వెంటనే అనుకున్నంత గొప్ప వుద్యోగం చేసెయ్యడం లేదని, మా నాన్నకి కోపమొచ్చి, ఇంటికొచ్చెయ్యమని ఉత్తరాలమీద ఉత్తరాలు దంచడం ప్రారంభించాడు. గవర్నమెంటు కాని,

యిదేం వైకుంఠపాళీ కాదుగదా నిచ్చెన్లు ఎక్కు-
కుంటూ పండిపోడానికి. గవర్నమెంటులో సీనియారిటీ,
గీనియారిటీ, రెడ్ టేప్, గిడ్ టేపు లక్షుంటాయి.
అందులో ఢిల్లీలో యివి మరీ జాస్తి. ఎక్కడో పల్లె
టూళ్ళో కూచుని ఇంకా కాలేదు, ఇంకా కాలేదు,
అని జపంచేస్తే కుదురుతుందా! సంగతి సందర్భాలన్నీ
చెప్పిచూదాం అని వెళుతున్నా.

రాఘు: (భద్రయ్యతో) ఏంకల్పన! మొహంచూస్తే ఆట్టే తెలివి
తేటలున్నట్టు కనిపించడం లేదుకాని భలే వోనుపులు
నేర్చాడు...నే పట్టలేకపోతానా! ఎంతసేపు తప్పించు
కుంటాడో నే చూస్తాగాదూ! (రామచంద్రయ్యతో)
ఇంటికగ్గిర చాలా రోజులుంటారా యేమిటి!

రాము: తెలీదు. మానాన్న వున్నాడు చూడండి. శుద్ధమూర్ఖుడు,
ఈ ఉద్యోగమెందుకు, పొలం దున్నుకోమంటాడు...
ఏమనాన్నా అర్థముందా! నేను... పొలం దున్నడమా..
అహా... దున్నడంకాదు, దున్నించడమే అనుకోండి...
అయితేనేమట్టుకు... కుండ పగలగొట్టినట్టు చెప్పెయ్య
దలుచుకున్నాను. నీ యిష్టమొచ్చినట్టు చేసుకో...
నే మాత్రం ఢిల్లీ వొదిలిపెట్టి పల్లెటూళ్ళో కూరుకు
పోదలుచుకోలేదు. అక్కడుండిపోయి నేనేం చెయ్య
గలనండీ... సివిలిజేషనా, మరోటా, మరోటా...

రాఘు: క్షేమయినమాట చెప్పారు. మీబోటివారు పల్లెటూళ్లో
వుండేం చెయ్యగలరు. ప్రతిభ రాణించాలంటే,
ఢిల్లీలో వుండాలి, లేదా బొంబాయిలో వుండాలి!

రామ: మీరు చాలా తెలివయినవారిలా వున్నారు. నా సంగతి ఒక్క నిమిషంలో పట్టేశారు. తమ పేరేమిటన్నారు?

రాఘు: రాఘవేంద్రరావు.

రామ: చూడండి రాఘవేంద్రరావుగారూ. మా తండ్రికేమో ఎంత పోరిచెప్పినా తెలీదు. పైగా ముక్కుమీద కోపం. ఇంటిదగ్గిర లడాయి తప్పదనుకుంటూను. అది తలుచుకుంటే వొళ్లు గగుర్పొడుస్తుంది.

రాఘు: ఈ గది చెమ్మగా వున్నట్టుంది. చలి చలిగా వుంది కాదూ?

రామ: లేకేం. పైగా మంచంమీద నల్లులున్నాయిరా బాబూ, కండలు యెక్కొచ్చేలా పీకిపెడతాయి.

రాఘు: అరెరె! ఎంత అపచారం. ఎంత గొప్ప అతిథి. ఎంత మర్యాద పొందవలసింది; నల్లులచేతా-బాధ పెట్టిస్తాడు యీ హోటలు యజమాని... గది చీకటిగాకూడా వున్నట్టుంది.

రామ: మెల్లిగా అంటారేం! అసలు యిది గదేమిటి, ఎలక బొక్క. మీరే చూస్తున్నారా, పట్టపగలే ఇలా వుంటే, రాత్రి యెలా వుంటుంది చెప్పండి. రెండు రోజుల్నించి గదిలో బల్బుకూడా పీకేశాడు. చీకటి గాఢాంధకారంలో కూచోవాలి. పని చేసుకోవాలన్నా, వ్రాసుకోవాలన్నా యెలా కుదురుతుంది?

రాఘు: అబ్బెబ్బే. ఎలా కుదురుతుంది. ఇదేంగది వెధవ గది!... మీరు క్షమిస్తానంటే, ఓమాట చెప్పనా?

రామ: చెప్పండి.

రాఘు: మీతో ఆమాట అనడానికి సంకోచంగా వుంది.

రామ: భయంలేదు-చెప్పండి.

రాఘు: అహాహా. ఆ గౌరవానికి నేను తగను. (అని గునుస్తాడు)

రామ: ఏమీ లేదు. చెప్పాలి!

రాఘు: ఏమీ లేదు. మా యింట్లో ఓ మంచిగది ఖాళీగా వుంది. కావలసినంత గాలి, వెలుతురు .. నల్లులేవు .. తమరు నా ఆతిథ్యం స్వీకరించి, ఆ గదిలో (నాలిక కరుచుకొని) నాకు తెలుసు, మీకు ఆతిథ్యం ఇవ్వడానికి నేను అనర్హుణ్ణి, కోప్పడకండి... ఏ దురుద్దేశమూ లేదు. కేవలం తమరు సుఖంగా వుండాలన్న వుద్దేశంతోనే ఇలాటి గొంతెమ్మ కోరిక తల పెట్టడానికి సాహసించాను.

రామ: ఛాఛ! దాని కింత ఉపోద్ఘాత మెందుకు! మీ యింటికి రావడానికి అభ్యంతరమేముంది. నల్లుల్లేవంటున్నారు. ఇక్కడికంటె అక్కడే సుఖంగా వుండొచ్చును. మీ కిష్టమయితే తప్పకుండా వస్తాను.

రాఘు: నా కిష్టమయితే, అంటారా? ఎంతమాట! మీరు మాయింటికొస్తానంటే, నాకెంత గౌరవం, ఎంత ఆనందం! మా ఆవిడకూడా చాలాసంతోషిస్తుంది. మిమ్మల్ని

పాగడ్డానికి అంటున్నా ననుకోకండి. అతిథి, అభ్యాగతుల్ని సత్కరించటం నాకు చిన్నప్పటినుంచీ పరిపాటి. అందులో, మీలాటి చదువుకున్న సంస్కారులని చూస్తే మరీని –

రామ: నాకూ అంతేననుకోండి. మిమల్నిచూస్తే నాకు చాలా యిష్టంగావుంది. ధారాళంగా దాపరికం లేకుండా మాట్లాడే వాళ్ళనిచూస్తే నాకు చాలా యిష్టం! ఒకటిచెప్పి, ఇంకోటి చేసేవాళ్ళని చూస్తే, అరికాలిమంట నెత్తికెక్కుతుంది. గౌరవం, విశ్వాసం ఈ రెండే నే మనుష్యుల్లో కోరేది. విశ్వాసం, గౌరవం

లక్ష్మణస్వామి, నరసన్న వొస్తారు

లక్ష్మ: పిలిచారండి!

రామ: అవునవును. బిల్లు తీసుకురా!

లక్ష్మ: ఇదివరకే యిచ్చేశాను. ఒకటికాదు, రెండుబిల్లులు!

రామ: ఎవరికి జ్ఞాపకముండి ఏడిశాయి నీబిల్లులూ నువ్వూను. ఎంతయిందో చెప్పు!

లక్ష్మ: ఎనిమిది రోజులున్నారు. గదికి రోజుకిరూపాయి. ఎనిమిది రోజులకీ... ఎనిమిది రూపాయలు. మొదటిరోజు రాత్రిపూట పూర్తిభోజనం, పన్నెండణాలు. రెండోరోజు రెండు భోజనాలు, రూపాయన్నర. టిఫిను, రూపాయి పావలా.

రామ: బుద్ధుందా లేదా, మొత్తం చెప్పమంటే ఒక్కొక్కటే ఏకరువు పెడతావా!

రాఘు: (లక్ష్మణస్వామితో) డబ్బుకేం తొందరలేదు. నే తర వాత పంపిస్తాను. సువ్వుంచు.

రాము: (తీసినడబ్బు మళ్లీ జేబులో పెట్టేసుకుంటూ) బాగుంది ఆలోచన. తరవాత సావకాశంగా పంపించవొచ్చు. (లక్ష్మణ్వసామి వెళ్ళిపోతాడు)

రాఘు: వూళ్ళో సంస్థలు ఏవైనా చూస్తారేమిటి ?

రాము: ఎందుకు? ఏమున్నాయి వాటిలో!

రాఘు: పెద్దలొస్తే నాలుగూ చూపించడం మాకు సరదా గౌరవం ...

రాము: అయితే తప్పకుండా చూస్తాను.

రాఘు: మొదట హైస్కూలుకి వెళ్ళొచ్చును. ఆ తరవాత ఆసుపత్రికి; అక్కణ్ణించి కోర్టుకి; అవసరమైతే జైలుకి!

రాము: (గాభరాపడుతూ) జైలుకెందుకు? అవసరమేమిటి?

రాఘు: తప్పు తప్పు. అవసరం కాదు. ఇష్టమైతే అనబోయి అవసరమైతే అన్నాను.

రాము: జైలు ఇష్టమేమిటి? వొద్దొద్దు. స్కూలుకీ, ఆసు పత్రికీ వెళ్ళి యింటికిపోదాం.

భద్ర: పోనీ, ఆంజనేయ స్వామివారి దర్శనం చేసుకు పోవొచ్చు.

రాము: అది బాగుందింకా. మీవంటి పెద్దల సాహచర్యం కుదిరినందుకు, స్వామివారికో దండం పారేసి, ఇంటికి పోదాం.

రాఘు : చక్కగా శెలవిచ్చారు. తమరు నావశమయినందుకు ...కాదుకాదు..తమరు నా ఆతిథ్యం స్వీకరించినందుకు నేనూ ఓ దండం పెట్టుకుంటాను .. మీరు నాతో బండిలో వొచ్చేస్తారా... వేరే మీ వాహనం...

రామ: ఎందుకూ! మీతో బండిలోనే వొచ్చేస్తాను.

రాఘు : భద్రయ్యా! నీ కయితే బండిలో చోటుండదు.

భద్ర : ఫరవాలేదు. నే ఎలాగో...

రాఘు : అభ్యంతరం లేకపోతే మా ఆవిడకో చీటిరాసి పంపిస్తాను, మీరొస్తున్నారని. మనం ఇల్లు చేరేసరికి గది తయారుచేసి పెడుతుంది.

రామ: ఆవిణ్ని అనవసరంగా శ్రమపెట్టడమెందుకూ...

రాఘు : తమరు రావడం...శ్రమేమిటి? సంతోషం...

రామ: అయితే రాయండి (రాఘువేంద్రరావు దగ్గిర పెన్నుంటుంది కాని కాగితముండదు.) కాగితం కావాలా ఏమిటి? (జేబులో తడుముకుంటాడు. హోటలుబిల్లు కనిపిస్తుంది.) ఈ బిల్లిక్కడుందా... దీనిమీద రాయండి పోనీ...

ఆబిల్లు తీసుకుని దానిమీద రాఘువేంద్రరావు భార్యకి చీటీ వ్రాస్తాడు. రామచంద్రయ్య వింటుని వుండడంచేత రాఘువేంద్రరావు కూడా వింటునే ఒకకాలు ఎత్తి మోకాలు ఎత్తుగా పెట్టి కష్టపడి చీటీ వ్రాస్తాడు. ఆ చీటీ భద్రయ్యకిచ్చి రహస్యంగా,

రాఘు : పరుగెత్తికెళ్లి ఆచార్లుతో మేమొస్తున్నామని చెప్పు. ఆ తరవాత మా యింటికి పరిగెత్తి దీన్ని మా ఆవిడ

కిచ్చెయ్యి. పరిగెత్తడమంటే గబగబ నడవడంకాదు. కాళ్ళు ఝాడించి పరుగెత్తాలి. తెలిసిందా. ఊ...

చీటీతీసుకుని భద్రయ్య బైటికి పోడానికి తలుపుతెరుస్తాడు. తలుపుని ఆనుకుని రహస్యాలు వింటున్న రుద్రయ్య తలుపు తెరవడంతోటే 'అరెరె' అంటూ చాపచుట్టగా లోపలికి నేలమీదపడతాడు. వెంటనే లేచి నుంచుంటాడు.

రామ: ఎవరు నువ్వు. దెబ్బేం తగల్లేదు కద!

రుద్ర: లేదు లేదు. ముక్కు మాత్రం ఒక్కపిసరు బొప్పి కట్టింది. డాక్టరు దగ్గిరకెళ్ళి ఓ చిన్న పాలాస్త్రీ పట్టీ వేయించేసుకుంటాను. అదే పోతుంది.

ముక్కు మలుపుకుంటూ వించుంటాడు.

రాఘు: మరేం ఫరవాలేదు, పదండి. నౌకరు మీ సామాన్లు తరవాత తీసుకొస్తాడు. (నరసయ్యతో) అయ్యగారి సామానులు మాయింటికి తీసుకుపో. మా యిల్లెక్కడంటే ఎవ్వరైనా చెబుతారు. పదండి.

అని దారి చూపిస్తాడు. మీరుముందు అంటే మీరుముందు అని రాఘవేంద్రరావూ, రామచంద్రయ్యా, ఒకరి నౌకరు దారిచూపి మర్యాదలు చేసుకున్న తరువాత రామచంద్రయ్య ముందు నడుస్తాడు.

రాఘు: (పళ్ళు కొరుకుతూ) ముక్కు చితకొట్టేస్తానుండు!

అని బెదిరించి వెళ్ళిపోతాడు

రుద్ర: ఎలాగా చితికేపోయింది. ఇహ మీరు చేసేదేమిటి?

అని ముక్కుచేత్తో పట్టుకుని వెళతూండగా తెర.

# మూడో అంకం

మొదటి అంకంలో కనిపించిన రాఘవేంద్రరావుగారి యింట్లో హాలు. ఏర్పాట్లలో యేమీ మార్పులేదు. రాఘవేంద్రరావుగారి భార్య చంద్రిక, కూతురు కవిత, తెర లేచేసరికి వుంటారు

చం : ఎప్పుడనగా వెళ్ళారు! ఇంతసేపేం జేస్తున్నారో. కబురన్నా పంపించాలని తెలీదూ? ఈ మొగాళ్ళ కిదే బుద్ధి. బైటికి వెడితేచాలు, యింటి ధ్యాసే పోతుంది. పెళ్ళాం పిల్లలూ ఏమయిపోయినా లెక్క లేదు! ఎవరో పెద్ద గవర్నమెంటు ఆఫీసరొస్తే చూడ్డానికి వెళ్ళారుటగదా, నన్నుకూడా తీసు కెళ్ళొద్దూ. నన్నింట్లో పారేసిపోతే కుదరదని ఇది వర కెన్నిమాట్లు చెప్పానో, ఎప్పటి కప్పుడే మరుపు! ఇంటికి రానీ, మళ్ళీ మరిచిపోకుండా జ్ఞాపక ముంచు కునేలా చెబుతాను. (కిటికీ దగ్గరకువెళ్ళి పైకి చూస్తుంది) ఒక్కపిట్ట లేదు. (కోపంతో) అందరూ చచ్చినట్టున్నారు!

కవిత : (తాపీగా) కొంచెంసేపట్లో యెవరో ఒకరొచ్చి కబురు చెప్పకుండా వుంటారా!

చం : ఆ, చెబుతారు. దొంగలుపడ్డ ఆరునెల్లకి కుక్కలు మొరిగినట్టు.

కవిత : అమ్మా, ఎందు కంత ఆత్రం!

చం : (చాలా కోపంగా) పైవాళ్ళున్నప్పుడు మర్యాద కోసం అమ్మాఅని పిలిచినా, మన మిద్దరమే వున్న

ప్పుడు 'అమ్మా' అనొద్దు, పిన్నీ అని పిలవమన్నానా? నీ ప్రేమ యేమీ వొలకపొయ్యక్కర్లేదు. నా అంత కూతురు అమ్మా అంటే నాకు ఏళ్ళు ముదిరినట్టనిపిస్తుంది.

కవి : ఎంత పౌడరు రాసుకుని, ఎన్ని షోకులు చేసుకుంటే మాత్రం, ఉన్న యేళ్ళెక్కడికి పోతాయమ్మా?

చం : నువ్వా, నేనా షోకులు చేసేది! సబ్బరిగి పోయేలాగ మొహం రుద్ది, రెండంగుళాల యెత్తున పౌడరు మెత్తుతావు! ఒకటే పోకిరీ షోకులు. పినతల్లి రాసి నంపాన పెడుతోందంటారని వూరుకుంటోంటేనూ, నన్నంటావా చిన్నంతరం పెద్దంతరం లేకుండానూ!

రుద్రయ్య పరుగెత్తుకుంటూ లోపలి కొస్తాడు. ముక్కుకి పాలాత్రు.

చం : కనిపించాడా ఆ గవర్నమెంటు ఆఫీసరు?

రుద్రయ్య జవాబుచెప్పక ఆయాసపడుతూ నించుంటాడు.

చం : బెల్లంకొట్టిన రాయిలా నించుంటావేం?

రుద్ర: పరుగెత్తు ... కొచ్చాను ... ఊపిరాడ్డం ... లేదు. కవితా, ... ఓ గ్లాసు మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా!

కవి : (కదలకుండా) ఆయాసం అణిగితేనే కాని, మంచినీళ్ళు తాగకూడదు.

చం : నోరు పెగిలిందిగా! సంగతి చెప్పు!

రుద్ర: మీ ఆయన . . ఈ చీటీ మీకిమ్మన్నారు. (చీటీ చంద్రిక చేతి కిస్తాడు)

చం. (చీటీ పుచ్చుకుని కవితతో) మంచినీళ్లు తెచ్చిపెట్టమంటే కదలవేం! (కవిత మూతివిరిగించి లోపలికి వెళ్ళిపోతుంది. చీటీ చదువుతూ) ప్రియతమా! (రుద్రయ్య సిగ్గు అభినయిస్తాడు) ఉస్ స్. (కవిత నీళ్ళగ్లాసుతో తొందరగావొచ్చి రుద్రయ్యకిస్తుంది. రుద్రయ్య గడ గడ తాగుతాడు) మొదట్లో చాలా గొడవగావున్నా ఆఖరికి భగవంతుడి దయవల్ల రెండు భోజనాలు–పెరుగు ఎక్స్ట్రా, రూపాయిన్నర. దోసె స్పెషల్ పావలా (చదువు ఆపేసి) ఏమిటిది! అర్థం కావడం లేదే. ఎక్స్ట్రా పెరుగు, స్పెషల్ దోశకీ ఏమిటి సంబంధం!

రుద్ర: తొందర్లో కాగితం దొరక్కపోతే, హోటలు బిల్లు మీదే రాసేశారు!

చం: అదా! (చదువుతూ) భగవంతుడి దయవల్ల చిక్కులన్నీ విడిపోయేటట్టున్నాయి. మనం గొప్పఅతిధుల్ని పెట్టే దక్షిణంవైపు గది వెంటనే తయారు చేయించు. ఆఫీసరు గారిని మన యింటికే తీసుకొస్తున్నాను. తలుపుకీ, కిటికీలకి కొత్త కర్టెన్లు వేయించు. సిల్కువి మనింట్లో లేకపోతే లీలారామ్ దుండూరామ్ షాపులోంచి వెంటనే తెప్పించు. తయారు చేసిన సిల్కు కర్టెన్లు ఆ మధ్య వాడికొట్లో చూశాను. వున్నవాటిలో మంచివి యివ్వకపోతే పిలక ఝూడిం చేస్తానని చెప్పు. రాత్రికి మాకోసం ప్రత్యేకంగా ఏమీ భోజనం తయారుచేయించొద్దు. ఆసుపత్రి

లోనే ఆ యేర్పాట్లు చేయిస్తున్నాను. మిగతా సంగతులు స్వయంగా విన్నవించుకుంటాను.. నీ ప్రియ సీసీ (సిగ్గు పడుతుంది. రుద్రయ్యకూడా సిగ్గు అభినయిస్తాడు.) ఈగవర్నమెంటు ఆఫీసరు చిన్నవాడేనా? నువ్వు చూశావా?

రుద్ర: ఓ!

చం : అంతసేపూ దగ్గిరే వున్నావా? మాట్లాడావా?

రుద్ర: (నసుగుతూ) దగ్గిర ... మొదట దూరంనించి, తలుపు కంతల్లోంచి చూసినా, ఆఖరికి యెదటపడి (ముక్కు తడుముకుంటూ) ముఖాముఖి చూశాను. పలకరించాడు. జవాబు చెప్పాను. ఎంత మెత్తని మనస్సు! కళ్ళలో ఎంతో కరుణతో 'దెబ్బేం తగలలేదు కదా' అన్నాడు.

చం : ఏం జరిగిందో మొదట్నించీ చెప్పు?

రుద్ర: దివాంజీ సాహెబ్ గారిని మొదట దూరందూరంగా వుంచాడు. 'హోటల్లో భోజనం బాగా లేదు. మంచం మీద నల్లులు. నీ పెళ్ళాం పిల్లలకోసం జైల్లో నేనెందు కుంటాను, హూత్ ... హోత్' అని కోప్పడినా దివాన్జీగారు దేనికది సర్ది చెప్పేసరికి క్రమేణా చల్లబడి మనసు మార్చేసుకున్నారు. ఆ తరవాత అంతా సవ్యంగా నడిచిపోయింది. వూళ్ళో సంస్థలు తణిఖీ చెయ్యడానికి కలిసి వెళ్ళిపోయారు. మొదట్లో మాత్రం చెప్పొద్దూ – తలుపవతలున్న నాకే గుండె దడలాడిపోయింది.

చం : నీకెందుకు భయం. పురోహితుడివి. గవర్నమెంటు ఉద్యోగమూ ఏమన్నానా?

రుద్ర: దానికేం. గొప్పవాళ్ళు ధాం, ధూం అంటూంటే ఎవరికైనా భయమెయ్యొచ్చు.

చం : బాగానే వుంది! చిన్నవాడేనా? ఎన్నేళ్ళుంటాయి?

రుద్ర: చిన్నవాడే! ముప్ఫయిలోపు కాని గొప్ప ఆరిందాలా మాట్లాడతాడు. (అనుకరించినట్లు) మీ ఇంటికొస్తాను. మీ కిష్టమయితే ... నాకు చదవడం, రాయడం ఇష్టం. ఈగది చీకటిగా వుండటంవల్ల నాకేదీ కుదరటంలేదు. (చేతులు తిప్పుతూ) టట్ టుట్ ...

కవి : ఎర్రగా వుంటాడా! పొడుగ్గా వుంటాడా, పొట్టిగానా?

చం : (వెనకటిమాట అప్పగిస్తూ) ఎందుకంత ఆత్రం. కొంచెంసేపట్లో ఎలాగా వొస్తాడుగా! సిగ్గా, శరమా ఎదటబడి ఎగా దిగా చూద్దువుగాని! అన్నట్టు ఎంత సేపయింది హోటలునించి బయలుదేరి? ఈ చీటీ ఎప్పుడిచ్చారు నీకు?

రుద్ర: మీ ఆయన ఈ చీటీ నాకివ్వలేదు. భద్రయ్యచేతి కిచ్చారు. భద్రయ్య ఆలయంలో ఏర్పాటుచేసుకొని వాలిగనక, నాకిచ్చాడు. చాలాసేపే అయింది. ఈ పాటికి ఆలయందగ్గర కొచ్చుండొచ్చు. లేకపోతే ఇక్కడికి వొచ్చేస్తూనే వుండొచ్చు! ...

చం : (గాభరాపడుతూ) గది తయారుచేయించ లేదే!
(అని లోపలికి వెళ్ళిపోతుంది.)

రుద్ర: ఎర్రగా బుర్రగా అందంగానే వున్నాడు.

చం : (ప్రవేశించి, కవితతో) అలానించుని పోతావేం! గది తయారుచెయ్యాలి, పద!

కవి: వొచ్చేశా (చంద్రిక లోపలికి వెళ్ళిపోతుంది) అందంగానే వున్నాడేం; పిన్నిని ఓకంట కనిపెట్టాలి! (లోపలికి వెళ్ళిపోతుంది.)

రుద్ర: ఆలయానికి పరిగెడితే కనిపిస్తారనుకుంటూ ... (పరుగెత్తుకుంటూ పోతాడు)

ఒక్కక్షణం స్టేజీమీద ఎవరూ వుండరు. లోపలగది సిద్ధంచేస్తున్నట్టు కొంత హడావిడి. పైనించి కొంతమంది మనుష్యులొస్తున్న అలికిడి, తరవాత, ఇటు, అటు అంటూ దారి చూపిస్తూ రాఘవేంద్రరావు, తరవాత రామచంద్రయ్య, ఆతని వెనక డాక్టర్ చంద్రశేఖర్, నాయుడు, ఆచార్లు, భద్రయ్య, ఆఖర్న రుద్రయ్య ప్రవేశం. రాఘవేంద్రరావుకి భార్య కిందపారేసినచీటీ కనిపిస్తుంది. పరుగెత్తి వొంగి అది తియ్యబోతాడు. భద్రయ్య, రుద్రయ్య కూడా అదే తియ్యడానికి పరుగెత్తుకొస్తారు. ముగ్గురూ ఢీకొంటారు. రాఘవేంద్రరావు ఇద్దర్నీ మింగేసేటట్టు చూస్తాడు. రుద్రయ్య ముక్కుపట్టుకు దూరంగా వెళ్ళిపోతాడు.

రామ: మీ వూళ్ళో సంస్థలు బాగున్నాయి. నన్ను అన్నింటికీ తీసుకెళ్ళి చూపించడం మరీ బాగుంది. ఇంతర వూళ్ళలో నాకెవరూ, ఏమీ చూపించలేదు!

రాఘు: మా వూరికీ, ఉత్తర వూళ్ళకీ సాటిచెప్పారు! అక్కడ ఆఫీసర్లు రెండుచేతులా తినడమే కాని...

రామ: అబ్బ మరీ ఎక్కువ తినేశాను! కాని భలే భోజనం. ఏమండీ, ప్రతిరోజూ విందుచేసినట్టుగా, అన్నిపదార్థాలతో భోజనం పెడతారేం?

రాఘు: అబ్బే, తమబోటి పెద్దలొచ్చారు గనక, ప్రత్యేకంగా ఏర్పాటు చేశాం.

రామ: నాకు భోజనం సుష్టుగానే వుండాలి సుమండీ! జీవితం ఎందుకు? మంచి వస్తువులు అనుభవించడానికి కాదూ? ఆ గుండ్రటిది, తియ్యనిది తిన్నాంచూడండి —దాని పేరేమిటి?

డా. చం: (ముందుకు తోసుకొచ్చి) నూర్జహాన్.

రామ: జహంగీర్ని తిన్నానుగాని, నూర్జహాన్ని నే నిదివరకెప్పుడూ ముట్టుకోలేదు. చాలా బాగుంది. మనం భోజనం చేసిందెక్కడ? ఆసుపత్రిలో కాదూ?

డా. చం: అవునవును—జిల్లా ఆసుపత్రిలో...

రామ: జ్ఞాపకమొచ్చింది ... చాలా మంచాలు ఖాళీగా వున్నాయి. అవునుగాని, రోగులు ఎవరూ కనిపించినట్టులేదు. అందరికీ రోగాలు కుదిరి, పోయారా ఏమిటి?

డా. చం: ఓ అరడజనుమంది వున్నారే! మిగతావాళ్ళంతా జబ్బులు కుదిరి వెళ్ళిపోయారు. ఆసుపత్రి నా చేతి

కింద కొచ్చిం దగ్గిర్నించీ రోగులకి పాడలు. డబ్బీలు కొడుతున్నా వనుకోకండి. నామందు తగిలేసరికి రోగులు ఎగిరిపోతారు. కాదు కాదు – రోగాలు ఎగిరి పోతాయి!

రామ: అంతేకద! నా చేతిమాత్ర, వైకుంఠయాత్ర అంటు న్నారేమో అనుకున్నాను. (అని నవ్వుతాడు. గొప్ప వాడు చేసిన హాస్యానికి అందరూ నవ్వాలి అన్న ధోరణిలో ఒకరికంటె ఒకరు గట్టిగా నవ్వుతారు)

రాఘు: ఈ రోజుల్లో జిల్లా ఆఫీసరు పని చాలాకష్టమయి పోయిందనుకోండి. భారమంతా అతగాడిమీద వుం టుంది. ఎక్కడ ఏదిపోయినా, వాడి ప్రాణంమీది కొస్తుంది వెయ్యికళ్ళతో కనిపెట్టుకు చూస్తేగాని అన్నీ సక్రమంగా నడవవు. ఏమయినా పాడయితే ప్రాణం తీస్తారేగాని, సక్రమంగా నడుస్తున్నప్పుడు ఎవరూ మెచ్చుకోరు. ప్రత్యేకంగా మెచ్చుకోవాలని కాదు...నా జిల్లా ప్రజలందరూ సుఖంగా వుండడం కంటె నాకు కావలసిందేవిటి? నా ప్రజల సంతోషమే నాకు వెయ్యిబహుమానాల పెట్టు.

ఆచా: (నాయుడుతో) చూశారా, ఎంత తియ్యగా కోస్తు న్నారో! అదృష్టవంతులు. నాలికమీద బృహస్పతి తాండవమాడతాడు – మన దివాన్జీగారికి.

రాఘు: ప్రజాసేవ! ఆఫీసులో వుండనీ, ఇంటిదగ్గిరగానీ ప్రజా సేవ తప్ప నాకు మరో వ్యాపకం లేదు.

రామ: ప్రజాసేవ చాలా గొప్ప విషయమేలెండి. నేనూ చాలాకైము దానికే వినియోగిస్తూ వుంటాను. మధ్య మధ్య మెదడుకి మేతగా చదవడం, రాయడం.

ఆచా: ఓహోహో! ప్రసంగంలోనే తెలుస్తోంది – రాతకోతల్లో తమ ఆసక్తి, చాతుర్యం!

రామ: అప్పుడప్పుడు మనసుకి ఉల్లాసం కలిగించేవి కూడా వుంటే... మీరేమిటి, ఎప్పుడైనా పేకాట...

రాఘు: ఛీ ఛీ ఛీ ఛీ పేకాట, జూదం, ఆ మాట ఎత్తనివ్వం ఇక్కడ. నాకు పేకముక్కలు గుర్తుతెలీదు. ఏది డైమండో, ఏది కళావరో కూడా తెలీదు.

నాయు: (డా. చంద్రశేఖరంతో) విన్నారా! పేకముక్కలు గుర్తుతెలీదు! మొన్న రాత్రంతా పేకాడి, బేస్తుల్లో నా దగ్గిర ముప్ఫయి రూపాయలు గెలుచుకున్నాడు!

రామ: ఏది డైమండో, ఏది కళావరో కూడా తెలీదు!

రాఘు: తెలీదంటే తెలీదు నమ్మండి. ఎప్పుడూ ముట్టుకో లేదు వాటిని; ఓ మాటు పేకముక్కల్తో మేడగట్టా సంతే; మా అమ్మాయిని ఆడించడానికి. అరెరె, మా అమ్మాయిని, ఆవిడని ఇంకా పరిచయం చెయ్యనే లేదు. అమ్మాయ్ కవితా! (హృదయ్యు ముందుకొచ్చి తనూ కేకేస్తాడు) కవితా!

చంద్రిక ప్రవేశిస్తుంది, ఆవిడే కవిత అనుకుని

రామ: రండి: రండి (అని షేక్‌హాండ్ ఇవ్వడానికి చెయ్యి జాచి ముందుకొస్తాడు. రాఘవేంద్రరావు భార్యకేసి చురచుర చూస్తాడు. చంద్రిక లక్ష్యపెట్టకుండా నమస్కారం పెడుతుంది. రామచంద్రయ్య కూడా చేసేది లేక తిరిగి నమస్కారం పెడుతూ) షేక్‌హాండుకి తప్పులేదండీ, ఢిల్లీలో ఇప్పుడు నమస్కారాలు రద్దు చేసేశాం...కవిత! ఎంతచక్కని పేరు. పేరుకు తగిన రూపం! (రాఘవేంద్రరావుతో) చాలా చక్కని కన్యని కన్నారండి. కంగ్రాచ్యులేషన్స్!

రుద్ర: మీరు...కవితగారు కారు!

రాఘు: చంద్రిక మా ఆవిడ.

రామ: (గుడ్లు పెద్దవిచేసి ఆశ్చర్యంగా చూస్తూ) చంద్రిక! జాతకపక్షులు కాచుకునూచునే చంద్రిక! మీ ఆవిడ! చాలా చాలా కంగ్రాచ్యులేషన్స్!

కవిత లోపలకొస్తుంది

రుద్ర: వీరు కవితగారు.

కవిత నమస్కారం చేస్తుంది. రామచంద్రయ్య ప్రతి నమస్కారం చేసి ఏకదీక్షగా చూస్తాడు.

రామ: నేను కవిని. మీరు నా కవిత!

చంద్రి: నించునే వున్నారు. కూచోండి. కూచోండి.

రామ: అవసరం లేదండి. జాతకపక్షులు చంద్రుడికేసి నోరు తెరుచుకు మరీ చూస్తూ వుంటాయట! మిమ్మల్ని చూస్తూ నుంచోడమే నాకు పరమానందం!

ఒకమాటు చంద్రికవేపూ, మరోమాటు కవితకేసి చూస్తూనుంటారు

చం : మాటవరసకంటున్నారు. నించోడం భావ్యంకాదు. కూచోవాలి.

రామ: మీ ఆజ్ఞ శిరసావహించక తప్పదు. నించునో, కూచునో, మీ సమక్షంలో, మీకు సన్నిహితంగా వుండడంకంటె కావలసిందేముంది. మీరు కూచుంటేనే గాని...

కవిత చంద్రిక కొంచెం దూర దూరంగా కూచుంటారు

రామ: (ఒక కుర్చీ దగ్గిరగా యీడ్చుకుని వాళ్ళకి ఎదురుగా కూచుంటాడు.) ఎన్నాళ్ళకి తిరిగి సౌందర్యం; సంస్కృతి కళ్ళబడ్డాయి!

చం: ఈ ప్రయాణాల్లో మీరు అలిసిపోయి వుండాలి.

రామ: (కవితకేసి చూస్తూ) ఢిల్లీలో వుంటున్నవాడికి ఈ వెధవ హోటళ్ళల్లో గడపవలసొచ్చేసరికి ప్రాణం విసికిపోయిందనుకోండి! మాట్లాడదామంటే, చూద్దామంటె, ఒక్క మంచి మొహం కనిపించదు. ఇక్కడ మీరు కనిపించారు, ప్రాణం హాయిగావుంది!

చం: పొగడ్డాని కంటున్నారుగాని, ఏదో యీ మూరు మూల...

రామ: రత్నం భూమిలో పాతుకుపోయి వుండదూ? మూరు మూల వుంటేనేం? మీరసలు ఢిల్లీలో వుండవలసిన వారు లెండి...ఏం వూరు... .ఏం మజా...ఏం అధి కారం!... గుమాస్తాల దగ్గిర్నించి...నేనేదో వ్రాత్తి

గుమాస్తా ననుకునేరు. ఊహు. మా డిపార్టుమెంటు సెక్రటరీకి నే లేకపోతే ఒక్కక్షణం గడవదు. అన్నిటికీ నన్నే పిలిచి సలహా అడుగుతాడు. అతగాడికి మనమెంత చెబితే అంత! అలాటప్పుడు మనకింకో డిపార్టుమెంటులో పెద్ద వుద్యోగం ఇస్తామన్నా కూడా ఎందుకు చెప్పండి; ఆ వెధ వుద్యోగం. ఈ డిపార్టుమెంటులోనే వుండిపోతున్నా. ఊ. డిపార్టుమెంటులో మనమంటే హడలు. అందరూ మనకి వొంగి వొంగి సలాములు పెట్టేవారే. ఆఫీసులోనే కాదు; ఎక్కడ కనిపించినా సరే! అంతమంది సలాములు పెట్టేది ఢిల్లీ మొత్తంలో మరెవరూ లేదనుకోండి. (అని అందరివైపూ తేరిపార జూస్తాడు. రాఘవేంద్రరావు వగైరాలు నించునే వున్నట్టు అప్పుడు తట్టుతుంది) నించునే వున్నారే... కూచోండి!

రాఘు: పరవాలేదు ఫరవాలేదు.

ఆచా: తమ సమక్షంలో మేము...

నాయు: నించోడమే మర్యాద.

రామ: మర్యాదలు కొంతసేపు కట్టిపెట్టండి... కూచోండి. (గట్టిగా ఆజ్ఞాపించినట్టుగా) కూచోండి. (అందరూ కూచుంటారు) నాకే మర్యాదలు, గిర్యాదలు, ఆట్టే పట్టింపు లేదు ... కళా ప్రపంచంలో తిరుగుతూ వుంటాను చూడండి, కొద్దోగొప్పో రాధ్ధాడు(?) చేత. అక్కడ సాంప్రదాయం వేరు. భాయీ భాయీ అను

కుంటాం! కవులు, నటకులు, నటీమణులు కలుసు
కుంటే, కౌగలించుకు మాట్లాడుకుంటాం!

కవిత : అలాగా!

రామ: మరేమిటి! ఇదే ఢిల్లీ అనుకోండి. భుజంమీద
చెయ్యేసి పక్కని కూచుంటాము. (అని యిద్దరికీ
మధ్య కుర్చీ జరిపి చంద్రిక భుజంమీద చెయ్యివెయ్య
బోతాడు. చంద్రిక కుర్చీ దూరంగా జరుపుకుంటుంది)
వెంకటశాస్త్రికీ నాకూ ప్రాణస్నేహం. పద్యాల్లో
వుత్తరాలు రాసుకుంటాం!

కవిత : ఆస్థానకవి చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారా, ఈమధ్యనే
పోయారు?

రామ: (ఏమీ చలించకుండా) అతనే, అతనే... పోకముందు
రాసుకునేవాళ్ళంలే!

చం: మీరయితే కవిత్వం రాస్తారన్నమాట. పత్రికల్లో
గాని, పుస్తకాలుగా గాని, అచ్చేయిస్తూ వుంటారా!
కవిత్వం రాస్తూంటే కాలం హాయిగా గడిచిపోతూ
వుండాలి!

రామ: ఏ కొత్త మాగజైను స్థాపించినా, నన్ను రాయమని
చంపేస్తారు. ఏడిచిపోతారుగదా అని రాసి పంపిస్తూ
వుంటాను. లెక్కాపత్రం లేకుండా రాశాను. ఏ పత్రి
కలో పడిందో, ఏమి రాశానో కూడా జ్ఞాపకముండదు
సాధారణంగా ... కొన్ని పెద్దవి రాశాననుకోండి.
హృదయేశ్వరి! ఊర్వశి ప్రవాసం... కిన్నెరసాని

పాటలు ఇలాటివేవో మూడో నాలుగో జ్ఞాపక మున్నాయి.

కవిత : ఇంతవరకు తెలీదు. ఈమాటు ఏ పత్రికలో మీా పేరు కనిపించినా చదివి తీరతాను.

రామ: అరెరె! గవర్నమెంటు ఉద్యోగ్యం కదా అని మారు పేరుతో రాస్తూవుంటానే!

కవిత : ఏ పేరుతో?

రామ: ఒకటేమిటి? సవ్యసాచి, బైరాగి, శివరామకృష్ణ, కను ణశ్రీ, అరుణశ్రీ, శ్రీశ్రీ, సర్వశ్రీ అన్నీ మనమే నీ పేరుతోనే రాయవోయ్, అడక్కుండానే నీకు పర్మిషన్ ఇచ్చాం. అని ఎడ్యుకేషన్ మినిష్టరు యీా మధ్య నాతో అన్నాడనుకోండి! ఏదో మారు పేర్లతో అల వాటయిపోయింది, మార్చడ మెందుకని వూరుకున్నా.

కవిత : దేవదాసు రాసిన శివరామకృష్ణగారు మీారేనా! ఆయన చెన్నపట్నంలో వుంటారని చదివాను లెండి, మీారనుకోలేదు.

చం: నువ్వొక్కటే తిన్నగా అనుకుంటావు కనకనా? నేనే శివరామకృష్ణనని ఆయన చెబుతూవుంటే, నీ చొప్పదంటు ప్రశ్నేమిటి?

రామ: కారణం లేకపోలేదు లెండి. కొంతకాలం కిందటనే చెన్నపట్నంలో వుండేవాడిని. మన ప్రతిభ రాణించ డానికి ఆ వూరు చాలదని ఢిల్లీ వెళిపోయాను. రాయ డం మొదలెట్టాను. అంచేత ఇప్పుడా పేరునే వాడి

లేసుకున్నాను. కాని మంచి సవల్లన్నీ నే రాసినవే లెండి

చం: అలాగా !

రామ: మరేమిటి! ఊపిరి నిలపకుండా రాస్తూంటాను, పైగా అందరికీ సలహాలు; దిద్దిపెట్టడమూను! సొంత పేర్లె ట్టుకుని రాసే పెద్ద కవులందరూ కూడా నాకు చూపించి, దిద్దించుకుంటేగాని, వాళ్ళ రాతలు ప్రచు రించుకోరుగా! విశ్వనాధ సత్యనారాయణకి సమా సాలు దిద్దిపెడతాను. దేవులపల్లి కృష్ణశాస్త్రికి లయ సవరించిపెడతాను. శ్రీరంగ శ్రీనివాసరావుకీని... చిల్లర కవులమాట చెప్పనే అక్కర్లేదు. ఢిల్లీలో మాయింటికొస్తే అరడజనుమందికి తక్కువ కాకుండా కవులు, నటకులు, నటీమణులు మాయింట్లో కని పిస్తారు (అందరినీ కలయజూసి) మీరెవరైనా, ఎప్పు డైనా ఢిల్లీ వొస్తే ... తప్పకుండా మాయింటికి రావాలి. మాయింట్లో పెద్ద పెద్ద విందులు చేస్తూ వుంటాను.

చం: నే ఊహించుకోగలను, మీ విందు ఎంత చక్కగా వుంటుందో !

రామ: లేదండి. నిజానికి మీరూహించుకోలేరు. ఓ విందు చేశాను; దేశం మొత్తంమీంచి అర్డర్లిచ్చి పిండి వంటలు తెప్పించాను. కలకత్తా నించి రొసగుల్లా, రొసమలాయ్. (దబ్బపండును సూచించేలాగ చెయ్యి పెట్టి) ఇంతింతవి ! బందరు నించి లడ్డూ, నెల్లూరు

నించి పీచుమిఠాయి, భీమవరం నించి పూతరేకులు; ఇక పళ్ళు: కోటనించి ఆపిల్సు, కాశ్మీర్ నించి కర్బూజాపళ్లు, ఓ పండండి (రెండుచేతులూ బాగా యెడంగా పెట్టి) ఇంత... ఎంతిచ్చా ననుకుంటారు... చెప్పండి. ఊహించండి చూదాం. డెబ్బయి రూపాయలు... ఒక్క పండు... ఇంత... ప్రైమ్ మినిస్టర్ కూడా మా ఇంటికొచ్చి విందులుతింటూవుంటాడు... 'ఎమ్బాసడర్‌గా అర్జెంటైనా వెళతావా; రాయబారిగా రుమేనియా వెళతావా' అని అడుగుతాడు... ఢిల్లీ విడిచి వెళ్ళడం ఇష్టంలేక 'నా కక్కర్లేదు నీ రాయబారాలు, నీ ఎమ్బాసడర్ షిప్పులూను' అంటాను. (రెండుచేతులూ తిప్పుతూ లేచి) పోనీ ఢిల్లీలోనే, హోం డిపార్టుమెంటులో వుండు. రాష్ట్రాలన్నీ పాడయిపోతున్నాయి. చూసిపెట్టు అంటాడు. నా డిపార్టుమెంటు విడిచి రాను. నన్ననవసరంగా చంపకు. పో. (చెయ్యి విసురుతాడు. ముందుకు తూలి పడిపోబోతాడు. నాయుడు, డా. చంద్రశేఖరం పడిపోకుండా పట్టుకుంటారు.)

రాఘు: (రామచంద్రయ్య దగ్గిరగా వెళ్ళి, వొణుకుతూ) త... తత్తే...

రామ: (తీవ్రంగా) త ఏమిటిది ?

రాఘు: త - తత్తే.

రామ: తత తత్తే అంటే... ఒక్క ముక్క అర్థంకావడంలేదు.

రాఘు: (కొంచెం తేరుకుని) త త్తమరు విశ్రాంతి తీసుకుంటా రేమో- గది సిద్ధంగావుంది.

రామ: నాన్సెన్సు. విశ్రాం తెందుకు? (ఎక్కిళ్ళొస్తాయి) ఆల్ రైట్ ...మీ రందరూ కోరితే తీసుకుంటాను... (మాటలు తడబడడం ప్రారంభిస్తాయి.) చాలా బాగుంది భోజనం... చాలా సం...తో...షం... (నాటకం ఫక్కీ-లో) నూర్జహాన్! నూర్ ...జహాన్..,

తూలుతూ లోపలికివెళతాడు. పడకుండా
పట్టుకోబోతూ రాఘవేంద్రరావు వెళతాడు.

భద్ర: ఏమి ప్రతిభ... ఏమి చాకచక్యం!

రుద్ర: ఇంత గొప్పవాణ్ణి-నే నిదివర కెప్పుడూ చూళ్ళేదు.

నాయు: ప్రైమ్ మినిస్టర్‌తో కూడా స్నేహం!

ఆ.చా: ఆవలిస్తే పేగులు లెక్క-పెట్టగలడు. అతి జాగ్రత్తగా వుండాలి.

డా.చం: తెల్లారి లేచి ఏం రాసిపారేస్తాడో, భయంగావుంది.

చం: నా కేం భయమెయ్యి లేదు. నన్ను చూసినప్పుడల్లా కవిత్వం చెప్పడానికి కొత్త భావం కలిగిందేమో నని పించేది.

కవిత: నాకూ అంతే.

చం: తగుదునమ్మా అని అన్నిటికీ నాతో పోంతుకు రాకు.

కవిత: నీతో పోంతుకి నా కేం అవసరం! నే తన కవితనని ఆయనే అన్నాడు.

గదిలోనించి ఉష్ ఉష్ అంటూ రాఘవేంద్రావు పైకొస్తాడు. ఒక్క క్షణం అందరూ విశ్శబ్దం.

చం: పడుకున్నాడా ?

రాఘు: ఆ.

నాయు: ఏమంటాడు, సందేహం ఏమీ లేదుగా !

రాఘు: లేనట్టేవుంది. అయినా, పరమాన్నంతో కలిపి భంగు పట్టించకపోతే బాగుండేదో ననిపిస్తుంది.

నాయు: భంగు పట్టించారా ! తెలిసింది, తెలిసింది ! ఇదే మిత్రా, ఇంతింత కర్బూజాకాయల ఖరీదు డెబ్బయి రూపాయ లని కోస్తూన్నాడు అనుకున్నా. భంగు ప్రభావమన్నమాట !

ఆచా: భంగెందు కిచ్చారు!

రాఘు: తేలకుండా వున్నాడే, కాస్త మత్తెక్కితే కాని నోరు విడదు కాబోలు, అని పట్టించాము. భంగు పలికిస్తుంది...

ఆచా: దాఖలా కనిపిస్తోందిగా !

రాఘు: దానివల్లే మళ్ళీ సంకటమొచ్చింది. కొన్ని కేవలం కోతలని తెలుస్తూనేవుంది. మిగతావి, ఏది కోతో, యేది నిజమో తెలీదు !

నాయు: డిపార్టుమెంటులో తనంటె హడలన్నది నాకు "నిజం"గానే తట్టింది.

డా. చం: వైద్యరాజీయం ప్రకారం భంగు సత్యానికి చిలవలూ పలవలూ తెప్పిస్తుందేకాని, కేవలం అస

త్యాన్నే పలికించదు. అంటేకొంచెం అతిగాపోయినా,
చెప్పిన ముఖ్యవిషయాలు అన్నీ నిజమేనన్నమాట !

నాయు: సందేహంలేదు ?

డా. చం: సందేహం లేదు !

నాయు: అయితే ఆలోచ నెందుకు ! ఆ ఇనస్పెక్టర్ జనరలే
వీడన్నమాట ?

ఆచా: అవునవును ! వాడే వీడు.

రాఘు: సందేహం లేదు. వాడే వీడు ! వాడే వీడు !!

మిగతా అందరూ అందుకుంటారు. అందరూ కలిసి
వాడే వీడు, వాడే వీడు ! అంటూంటే - తెర.

# నాలుగో అంకం

మరునాడు ఉదయం. పూర్వపుహాలే. తెర లేచే సరికి రాఘవేంద్రరావు పోలీసు సూపరిండెంటు మహంకాళితో మాట్లాడుతూ వుంటాడు.

రాఘు: బయట ఇద్దరు పోలీసువాళ్ళని కాపలాపెట్టు. బయట వాళ్ళెవర్నీ లోపలికి రానివ్వకూడదు. ఎవరన్నా ఫిర్యాదు చెయ్యడానికొస్తే గెంటిపారెయ్యమను. నే తిరిగొచ్చిందాకా నువ్వుకూడా కాపలాకాయి. తెలిసిందా (అంటూ బయటికి వెళతాడు, తలూపుతూ. ఆయన వెంట మహంకాళి వెళతాడు. ఒక్కక్షణం స్టేజీమీద ఎవరూ వుండరు. నిశ్శబ్దం. తరవాత నాయుడు, వెంకప్ప, ఆచార్లు, డా. చంద్రశేఖర్, భద్రయ్య, రుద్రయ్య చప్పుడు చెయ్యకుండా, దొంగల్లా ప్రవేశిస్తారు. అందరూ నెమ్మదిగా, రహస్యాలు మాట్లాడినట్టు మాట్లాడతారు. ఒకరి తరవాత ఒకరు లైనుగా నించుంటారు)

నాయు: ఇలా లైనుగా నుంచోడంకంటె, అర్ధచంద్రాకారంతోవుంటే సంతృప్తికరంగా వుంటుందేమో! (అందర్నీ అర్ధచంద్రాకారంలో నిలుచోపెడతాడు. అందరూ చేతులుకట్టుకు నిలుచుంటారు. ఒక్కక్షణం నిశ్శబ్దం)

ఆచా: రిక్తహస్తాలతో, చేతులుకట్టుకు ఎలా నించుంటే మాత్రం-వారిని తృప్తిపరచ గలంటండీ!

నాయు: ఫఖిటీ ఖీా ఉద్దేశం?

ఆచా: మీకు తెలియని దేముంది. పెద్దల సందర్శనం చేసుకునేటప్పుడు యథాశక్తి, పుష్పం... ఫలం... సమర్పించుకుంటే...

డా. చం: చెయ్యితడిచేస్తేనేగాని లాభముండ దంటారు, ఆచార్లుగారు.

ఆచా: (నోరు నొక్కుకుంటూ) అవ్వ! నేనేమీ అలా అనడం లేదండోయ్. పుష్పమో, ఫలమో సమర్పించుకోడం సాంప్రదాయం. సాంప్రదాయసిద్ధంగా నడుచుకుంటే మంచిదేమో అంటున్నాను.

నాయు: నిజమేగాని, ఏమంటాడో, ఎలా తీసుకుంటాడో తెలీదుగద! అల్లరిచేసి కొంపముంచుతే?

డా. చం: వారికిచ్చినట్టు కాకుండా వారి అభిమాన సంస్థలకిస్తే...

వెంక: ఫలానివాడు పంపినట్టు తెలియకుండా, పోస్టులో పంపితే!

ఆచా: ఎవరు ఇచ్చారో తెలీకుండా చేసుకుంటే లాభమేమిటి? వ్రతం చెడ్డా ఫలం దక్కాలన్నారు.

డా. చం: నిజమే. ఏం చేద్దాం!

ఆచా: కొన్ని కొన్ని కార్యాలు ఏకాంతంగానే చెయ్యాలి? అందరం కలిసి ఒక్కమాటు బయటపడడం మంచిది కాదు. విడి విడిగా వారిని దర్శించుకుని... రెండో కంటికి తెలీకుండా... ఏమంటారు!

డా. చం: క్షేమంగ్గావుంది. పెద్దలు నాయుడుగారు ప్రారంభిస్తే

నాయు: (గాభరాపడుతూ) నేనొద్దు... నేనొద్దు. ఆసుపత్రిలో ఆతిథ్యమిచ్చి అనుభవం గడించారు గనుక ఈ కార్యక్రమం ఆరంభించడానికి మీరే తగుదురు!

డా. చం: నేకాదు. ఆచార్లుగారే ఇందుకు...

ఆచా: నాకసలే భయం. నావల్ల కాదు. నాయుడుగారే దారి తియ్యాలి.

డా. చం: నాయుడుగారూ, మీకు తప్పదు.

వెళ్ళనంటూన్న నాయుడివి లోపలికి తొయ్యడానికి ప్రయత్నిస్తారు. లోపలినించి నరసన్నా అని రామచంద్రయ్య పిలుపు వినిపిస్తుంది. ఒకరినొకరు తోసేసుకుంటూ పైకి పరుగెడతారు. రుద్రయ్య, భద్రయ్యా నాకాలు తొక్కావు, అని కుంటుకుంటూ వెళతాడు. స్టేజీమీద ఎవరూ వుండరు. ఒక్క క్షణం నిశ్శబ్దం. కళ్ళునులుము కుంటూ రామచంద్రయ్య ప్రవేశం.

రామ: భలే నిద్దరట్టిపోయింది. (వొళ్ళు విరుచుకుంటూ) ఏం మెత్తగావుంది పరుపు! బూరుగు దూదికాబోలు! తల గడలేగాని, బూరుగుదూది పరుపులెక్కడా చూళ్లేదు (ఆవలిస్తూ) మాట్లాడుతూంటేనే కళ్ళు కూరుకు పోయాయి నిన్నరాత్రి... ఏం మాట్లాడానో కూడా తిన్నగా జ్ఞాపకంలేదు. కులాసాగా గడిచిపోయింది! పరిస్థితి ఎంతలో మారిపోయింది. నిన్న మధ్యాహ్నం నల్లులమంచం; పట్టెడు మెతుకులకి ప్రాధేయం! రాత్రికి పంచభక్ష్య పరమాన్నం; హంసతూలికా తల్పంమీద శయనం! గిరీశంగా రన్నట్టు, క్వైట్ అనెక్స్పెక్టెడ్ (quite unexpected) దివాన్జీ సాహెబ్

వారి కూతురునన్నా, మించి వారి భార్యయునన్నా ...
రోజులు క్షణాలై పరుగెత్తగలవన్నమాట !

అంటూవుంటే నాయుడు ప్రవేశించి కొంతదూరంలో
నించుంటాడు. కాళ్ళు వొణుకుతూ వుంటాయి.

నాయు: నేను ... పరంధామరావు నాయుడు ... జిల్లా జడ్జీని ...

రామ: (కూచుని) రండి ... కూచోండి (నాయుడు ముళ్ళమీద కూచున్నట్టు కూచుంటాడు. కుశల ప్రశ్నగా) ఎన్నేళ్ళ నించీ జడ్జీగా వుంటున్నారు!

నాయు: నాలుగేళ్ళయింది ... సంస్థానం విలీనం కాకమునుపు నించీ ...

రామ: అలాగా ... కేసులు గీసులు బాగా వున్నాయా ?

నాయు: ఆ; (డబ్బుతీసి చేతిలో పట్టుకుంటాడు. చెయ్యి వొణుకుతుంది. పట్టు విడిపోయి డబ్బు కింద పడి పోతుంది.)

రామ: ఏదో పడిపోయింది !

నాయు: ఏమీలేదు. ఏమీలేదు !

రామ: (వొంగి తీస్తాడు) అరె ! నోట్లు! ఏమీ లేదంటారేం ? (తిరిగి ఇచ్చెయ్యబోతూ) నాయుడుగారికి సొమ్ము చేదుగా వున్నట్టుంది!

నాయు: లేదు లేదు. (అని చేతులు తిప్పుతాడు— సొమ్ముతీసు కోడు)

రామ: ఓపని చేస్తారేమిటి ? ఈ సొమ్ము నాకిప్పిస్తే...

నాయు; తప్పకుండా; తప్పకుండా ...

రామ: ప్రయాణాల్లో డబ్బ్బాకే ఖర్చయి పోతుంది. చూడండి... సొమ్ము దగ్గిరుంటే ఎందుకైనా మంచి దని. ఇంటికి వెళ్ళగానే పంపించేస్తాను.

నాయు: ఎంతమాట ! ఎంతమాట ! ఆ మాటనుకోవద్దు. నా సొమ్ము మీదగ్గరుంటే నాకెంత గౌరవం! మీకాలం నేనింక వృథాపుచ్చను.(లేచి) ఏమన్నా..సలహాలిస్తే-

రామ: ఏం సలహాలు !

నాయు: (చేతులు నలుపుకుంటూ) కోర్టువిషయమై ...

రామ: ఎందుకూ ? నాకూ కోర్టుకి సంబంధమేమిటి ? సలహా లేమీ లేవే ! (జేబులో పెట్టుకున్న సొమ్ముతట్టుతూ) దీనికి, థాంక్సు !

నాయు: శలవిప్పిస్తారా (అని నమస్కారం చేసి గబగబ వెళ్ళి పోతాడు. డా. చంద్రశేఖర్ ప్రవేశిస్తాడు)

రామ: నాయుడు చాలా మంచివాడిలా కనిపిస్తున్నాడు !

డా. చం: నా పేరు డాక్టర్ చంద్రశేఖర్. డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసర్ అండ్ ఆసుపత్రి సూపరింటెంటుని.

రామ: తెలుసు తెలుసు. నిన్నరాత్రి మీ ఆసుపత్రిలోనేగా విందు ! చాలా బాగుంది.

డా.చం: వ్యవధి లేకుండా ఏర్పాటు చెయ్యవలసొచ్చింది. తమ గౌరవానికి తగిన విందు చెయ్యగలనా అని చాలా భయపడ్డాను ! నచ్చిం దన్నారు. ప్రాణం కుదుటబడింది. తమబోటి పెద్దల్ని తృప్తిపరచడం

కంటె కావలసిం దేముంది... తమ కేమైనా కావల సుంటే...

రామ: నా కేం కావాలి... అవసరమున్నట్టు తోచదు ... (డా. చంద్రశేఖర్ కోటు లోపలి జేబులో చెయ్యిపెట్టు కుని ఎప్పుడు డబ్బు తీద్దామా అని వుంటాడు. అది కనిపెట్టి) ఈ ప్రయాణాల్లో తెచ్చిన డబ్బు చాలా మటుకు అయిపోయింది...... మీదగ్గి రేమయినా సొమ్ముంటే... అప్పిస్తారా యేమిటి ?

డా.చం: తప్పకుండా.

రామ: మూడొందలుంటే చూడండి, (డా. చంద్రశేఖర్ సొమ్ము తీసి ఇస్తాడు. జేబులో పెట్టుకుని) ఇల్లు చేరగానే పంపిస్తాను.

డా.చం: తొందర్లేదు. తొందర్లేదు... వెళ్ళిరానా... ఆసు పత్రిసీ, నన్నూ ఓకంట చూస్తూవుంటారుకాదూ...

గబగబ వెళ్ళిపోతాడు

రామ: తమాషాగానే వుంది. ( సొమ్ము లెక్కపెట్టుకుని ) నాయుడు మూడొందలు, డాక్టరు మూడొందలు, అడక్కముందే అప్పు పుడుతోంటే... అడక్కపోడమే దోషమన్నమాట !

పైవించి, వెంకప్ప 'ఇంకా భయమెందుకయ్యా' అంటాడు. ఆచార్లు 'బాబ్బాబు, ఈమాట నువ్వెళ్లు. తరవాత నేను' అంటాడు ఒక్క క్షణం విశ్శబ్దం. వెంకప్ప లోనికి ప్రవేశిస్తాడు.

వెంక: నమస్కారమండి.

రామ: నమస్కారం.

వెంక: నేను ఈవూరి పోస్టుమాస్టర్ని. వెంకప్పపంతులంటారు.

రామ: అలాగా! రండి. కూచోండి.

వెంక. (కూచుని) ఢిల్లీలో మనవాళ్ళంతా ఖులాసాగావున్నా రాండి!

రామ: ఆ.

వెంక: ఆ మధ్య ఢిల్లీ వొద్దా మనుకున్నా, మన డిపార్టు మెంటు హెడ్డాఫీసుకూడా ఢిల్లీయే చూడండి!

రామ: రాలేదేం?

వెంక: తీరి కెక్కడిది చెప్పండి. ఎప్పుడూ ములగానాం, తేలానాం!

రామ: అంత పనేం?

వెంక: ఏం చెప్పను. ఎగగొట్టే వాడిని ఎవరూ అడగరు! చేసేవాడి నెత్తినే అంత పనీ రుద్దుతారు. మాటవరసకి, నాయుడుగార్ని చూడండి. జిల్లా జడ్జీగారా! క్లిష్టమైన కేసులు విని తీర్పుచెప్పాలా! నిజానికి బుర్ర వేడెక్కి బద్దలయిపోవలసినపనేనా? నాయుడు గారికిమాత్రం నిశ్చింత! పెంచుతున్న కోళ్లు పుష్టిగా వున్నాయో లేదో ఓమాటు తణిఖీచేసుకు హాయిగా నిద్రపోతాడు.

రామ: అరే, మరి తీర్పులు!

వెం : వాటి గొడవ అవి పడతాయి. ఉభయపక్షాల ప్లీడర్లనీ తీర్పులు రాసుకు రమ్మంటాడు. తదుపరి వేలంపాటంటే నమ్మండి, ఎవ డెక్కడ కట్నం చదివిస్తే వాడి పక్షమే. సదరు తీర్పుమీద జడ్జీగారు సంతకం పెడతారు.

రామ: ఇదేం న్యాయం ?

వెంక: ఇవి న్యాయానికి రోజులు టండీ... పైగా కారక్టరు కూడా మంచిదికాదు.

రామ: కారక్టరుకూడా ?

వెంక: (రహస్యం చెబుతున్నట్టు, ముందరికి జరిగి) భద్రయ్యా లేడూ, ఆంజనేయస్వామి... అతగాడు బయటికెళితే, జడ్జీగారుఇంట్లో దూరుతాడు... హెడ్మాస్టర్ ఆచార్లగారింటోకూడా జడ్జీగారు ... ఆ మాస్టరుగారికి ప్రయివేటు ట్యూషన్లుచెప్పుకు డబ్బుచేసుకోడంతప్ప యితరధ్యాసలేదు. ఆయనదగ్గిర ట్యూషనుచెప్పించుకున్నవాడే పాసు. మిగతా... శివరం !... ఆసుపత్రి సూపరింటెంటుగారి సంగతి అడగనే అక్కర్లేదు. అంతా గుటకాయిస్వాహా! రోగు లందరూ రోడ్డుమీద; ఆసుపత్రిలో విందులు; వినోదాలు !

రామ: అన్ని సంస్థలూ పాడుగానే వున్నాయన్నమాట ?

వెంక: సాయంకాలానికి తమరే స్వయంగా కనిపెట్టెయ్యరూ! కడుపు చించుకుంటె కాళ్ళమీద పడుతుంది. మా వాళ్ళని నే ననడమెందుకు? అయినా, మీరూ నేనూ

ఢిల్లీ గవర్నమెంటు వాళ్ళ మవడంచేత... ఇక్కడ ఆఫీసర్లు బ్రహ్మని తిమ్మని... తిమ్మని బ్రహ్మనిచెయ్యగల ధురంధరులు గనక... మీ మేలుకోరి... తస్మాత్ జాగ్రత్త జాగ్రత్త... వెళ్ళిరానా... నే నిలా చెప్పానని మాత్రం ఎవరితోటీ అనకండేం...

రామ: అబ్బెబ్బె.

వెంక: నే వెళ్ళొస్తాను. దయుంచండి (రెండడుగులు వేస్తాడు)

రామ: (వెళుతున్న వెంకప్ప కేసి ఒక్కక్షణంచూసి, మనసు నిశ్చయంచేసుకున్నట్టు తల పంకించి, తనూ రెండడుగులేసి) మాస్టారూ, మాట! (వెంకప్ప తిరిగొస్తాడు) మీరు నా మేలుకోరినవారుకనక సంకోచం లేకుండా అడుగుతున్నాను.

వెంక: తప్పకుండా అడగండి! మీకు సహాయంచెయ్యడం నా విధి!

రామ: అలా ధైర్యమిస్తే... ఈ ప్రయణాల్లో అనుకోని ఖర్చులు తగిలాయి. తెచ్చిన సొమ్ము, ఇంటిదాకా ఆగేటట్టులేదు. ఇంటికి వెళ్ళగానే పంపించేస్తాను... అప్పమైనా...

వెంక: అభ్యంతర మేమిటి? ఏమాత్రం కావలసుంటుం దేమిటి?

రామ: నాలుగొందలైతే...మూడొందలయినా చాలు.

వెంక: (జేబులు తడుముకుంటూ) ఎంత పనయిపోయింది. వేసుకొచ్చిన డబ్బు ఆచార్లగారడిగితే ఇప్పుడే యిచ్చేశాను. సాయంత్రం తీసుకొస్తాను మరేమీ అనుకోకండి.

రామ: లేకపోతే పోన్లెండి.

వెంక: లేకపోవడమేం ఖర్మ! పదినిమిషాలు ముందరడిగితే యిచ్చివుందునుగా... సాయంకాలం తప్పకుండా తీసుకొస్తాను శలవా (అని నమస్కారంపెట్టి గబగబ వెళ్ళి పోతాడు.)

రామ: నేనెవరో పెద్ద ఆఫీసర్ననుకుని ఈ సేవలన్నీ చేస్తున్నారా... బాగుంది...హాయిగావుంది. జరిగినన్నాళ్ళే జరగనీ... మన దేంబోయింది. "సిరిదా వొచ్చిన వొచ్చును, సలలితముగ నారికేళ సలిలముభంగిన్" అదృష్టవంతుణ్ణి ఎవరూ చెరపలేరన్నారు!

ఇంతవరకూ పరిస్థితులు ఏమిటో, తనకి ఏమి జరుగుతోందో తిన్నగా అర్థంకాని వాడిలా వుంటాడు. ఇహవించీ పరిస్థితులు అవగాహన చేసుకుని అదుపులో పెట్టుకున్నవాడిలా నటిస్తాడు. భయ పడుతూ ఆచార్లు లోపలికొస్తాడు. నమస్కారంపెట్టి నించుంటాడు.

రామ: (నమస్కారం అందుకుని) రండి; రండి. మీకోసమే చూస్తున్నా ... (సిగరెట్టు ముట్టిస్తాడు) సిగరెట్టు కాలుస్తారా యేమిటి?

ఆచా: చిత్తం. అలవాటు లేదండి.

రామ: పొగాకు సేవే అలవాటులేదూ?

ఆచా: (గాభరా పడుతూ) లేదండి... కాదు కాదు. వుందండి ...కొంచెం నశ్యం!

రామ: అలాచెప్పండి! బుర్ర పనిచెయ్యానికి పొడుంపట్టే చాలా ఖుద్ధిదంటారు, ఏది? (చెయ్యి జాపుతాడు)

ఆచా: (తికమక పడుతూ) చిత్తం ... (పొడుం డబ్బీ యిస్తాడు)

రామ: (ఒక పట్టుతీసి పీల్చకుండానే చేత్తో పట్టుకుని) స్కూలు బాగా సాగుతోందా?

ఆచా: చిత్తం...యెస్ సార్.

రామ: (కుశలప్రశ్న చేస్తున్న ధోరణిలో) సొమ్ముకేమీ ఇబ్బందిగా వుండడం లేదుగద!

ఆచా: చిత్తం, తమదయవల్ల....

రామ: దగ్గర సొమ్ముందా?

ఆచా: చిత్తం.

రామ: చూడండి, ఏమాత్ర ముంటుందో!

ఆచా: (తెల్లబోతూ, జేబులోంచి సొమ్ముతీసి లెక్కపెట్టకుండానే) నాలుగొందలుందండీ.

రామ: అప్పిస్తారా ఆ సొమ్ము! అవసరంగావుంది.

ఆచా: చిత్తం. (ఇక ఏమనాలో తెలీక సొమ్ము చేత్తో పుచ్చుకుని అలానే వుండిపోతాడు.)

రామ: (ఆచార్లు చేతులోంచి సొమ్ము తీసుకుని, జేబులో పెట్టుకుని, నమస్కారం పెడుతూ) శలవు!

ఆచా: చిత్తం. శలవు!

రామ: మళ్ళీ కలుసుకుందాం!

ఆచా: చిత్తం. (అని దిమ్మెరపోయి వెళ్ళిపోతాడు)

రామ: (జేబు తట్టుకుంటూ) ఫరవాలేదు! వెయ్యి భర్తీ అయింది.

భద్రయ్య, రుద్రయ్య లోపలికొస్తారు

భద్ర: నేను భద్రయ్యని... ఆంజనేయస్వామి ఆలయ...

రామ: (అందుకొని) ధర్మకర్తలు!

రుద్ర: నేను రుద్రయ్యని.

భద్ర: వూరికి పెద్ద పురోహితుడు!

రామ: నిన్నూ ఎక్కడో చూసినట్టేవుంది; ఆc. జ్ఞాపక మొచ్చింది. హోటల్లో వుండగా లోపలికొచ్చి పడ్డావు. ముక్కలావుంది!

రుద్ర: మానిపోతోంది.

రామ: అదృష్టవంతుడివి. (ఒక్క క్షణం నిశ్శబ్దంగా వుండి అకస్మాత్తుగా) డబ్బొంతుంది!

రుద్ర: డబ్బా! ఏం డబ్బు! ఎంత డబ్బు!

రామ: ఓ వెయ్యి రూపాయలు! నాకప్పివ్వడానికి?

రుద్ర: వెయ్యిరూపాయిలే? నాదగ్గిరంత డబ్బెందుకుంటుంది?

రామ: పోనీ, ఓవంద రూపాయ లుంటుందా?

రుద్ర: వందమాత్రం ఎక్కడిదీ!

రామ: (కఠినంగా) ఎంతుందో, తియ్యి?

రుదర్రియ్య రెండు జేబుల్లోంచి కొన్ని నోట్లు తీస్తాడు.

రుద్ర: ముప్ఫైరూపాయలు.

రామ: (రుద్రయ్య చేతిలోంచి సొమ్ము తీసుకుని, భద్రయ్యతో) నీదగ్గిరెంతుంది?

భద్ర: నాదగ్గిరా? నాదగ్గిర... (జేబులోంచి తీసి) అరవై రూపాయలు.

రామ: (తీసుకుంటూ) అరవై, ముప్పై, తొంభై. చాలదు. వందయినా వుండాలి.

భద్ర : రుద్రయ్యా... మొల్లో దోపినసొమ్ము తీశావా ?

కొర కొర చూస్తూ రుద్రయ్య మొలలో దాచుకున్న సొమ్ము తీస్తాడు. తొమ్మిది రూపాయల పావలావుంటుంది. రామచంద్రయ్య తీసుకుంటాడు.

భద్ర : క్షమిస్తే-ఒక్క మనవి చేసుకుంటాను.

రామ: చెప్పు.

భద్ర : నాయుడుగారికి, సంసారాలు చెఱుపుతాడని బహు చెడ్డ పేరుంది. ఈ వూరినించి బదిలీ చేయించేస్తే...

రామ: ఇంతేనా ! ఢిల్లీ వెళ్ళగానే హోం మినిస్టర్‌తో మాట్లాడతాను.

భద్ర: శ్రమ యిచ్చానని కోకూడదు. ఆజన్మాంతం కృతజ్ఞతతో వుంటాను.

రామ: మరేం భయపడకు. బదిలీ అయిపోయినట్టే. (రుద్రయ్యతో) నీకేమీ కోరికలు లేవూ ?

రుద్ర: ఏమీ అక్కర్లేదు కాని..

రామ: చెప్పు. సంకోచ మొద్దు.

రుద్ర: ప్రైమ్ మినిష్టర్ గార్నెప్పుడైనా కలుసుకుంటారా ?

రామ: ఎందుకు కలుసుకోనూ ?

రుద్ర : కలుసుకున్నప్పుడు 'ఫలాని వూళ్ళో రుద్రయ్య వున్నాడు, చాలాగొప్ప పురోహితుడు' అని చెప్పండి.

రామ: ఇంతే ?

రుద్ర : ఇంతే !

రామ: తప్పకుండా చెబుతాను. అంతేనా ?

రుద్ర: అధ్యక్షుణ్ణికూడా ఎప్పుడైనా కలుసుకుంటారా ?

రామ: ఓ.

రుద్ర: మరయితే వారితోకూడా ఓమాటు చెప్పెయ్యండి. 'ఫలానివూళ్ళో రుద్రయ్య వున్నాడు. చాలాగొప్ప పురోహితుడు' అని–చాలు.

రామ: అలాగే.

రుద్ర: వాళ్ళకెప్పుడైనా గొప్ప పురోహితుడు అవసరమయితే వారే పిలిపించుకుంటారు.

ఒక్క–క్షణం ఒకరినొకరు చూస్తూ నిశ్శబ్దంగా వుండిపోతారు.

రామ: వెళ్ళిరండి.

రుద్ర: (రెండుచేతులూ ఎత్తి–దీవించినట్టు) శ్రీరామరక్ష ! నూరేళ్ళాయుష్షు.

రామ: ఇంద (రుద్రయ్య దగ్గిరనించి తీసుకున్న పావలా తిరిగి అతనికి దక్షిణ యిస్తాడు. అతను మొలలో దోపు కుంటాడు)

రుద్ర: పద భద్రయ్యా ! మీ అమ్మ కడుపు చల్లగా, మీ అయ్యకడుపు చల్లగా (నడుస్తాడు)

భద్ర: శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం, ప్రభాదివ్య కాయం.

అనుసరిస్తాడు

రామ: (పచారుచేస్తూ) రూపాయితక్కువ పదకొండువందలు రొక్కం. అడుగులకి మడుగులొ త్తేఆఫీసర్లు...వారేవా, జీవితంలో ఇలాంటిది ఒక్కరోజు చాలదూ. కళా పతికి వెంటనే ప్రత్యుత్తరం రాయాలి. కధలు, నాట కాలు రాస్తానంటాడు. తెలిసొస్తుంది, కల్పించే నాట కాలంటే ఎన్నిరెట్లు గొప్పనాటకం, నా జీవితంలోనే, జరుగుతోందో! నరసన్నా ...నరసన్నా ... (నరసన్న వొస్తాడు) నా ఫౌన్ టిన్ పెన్, కాగితాలు తెచ్చి పెట్టు. (నరసన్న వెళతాడు) కళాపతి నవ్వలేక చావాలి; దేఖో నా తడాఖా! (నరసన్న కాగితాలు, పెన్ తీసుకొస్తాడు కూచుని రాసుకుంటాడు. నరసన్న అక్కడే నిలబడి చూస్తూవుంటాడు. కొంతసేపయిన తరవాత)

రామ: (రాసుకుంటూనే) ఏంవోయ్, నరసన్న. కనిపెడు తున్నావా, మనప్రభ ఎలా వెలుగుతోందో!

నర : బాబూ, నే నోమాట సెబుదునా?

రామ: దంచెయ్ ...

నర : సల్లగా జారుకోడం మంచిది బాబూ!

రామ: వేడిశావు! ఇదేం సలహారా, బోడిముండ సలహా! స్వర్గభోగాలు వొదులుకోమంటావురా ?

నర : యెలుగుండగా యిల్లు సక్కబెట్టుకోవద్దా. యెవరూ కనిపెట్టకముందే...

రామ: ఏమిటి కనిపెడతారు, నీ తలకాయి! మనమేం చేస్తున్నాం- ఇచ్చింది పుచ్చుకుంటున్నాంగాని ...

నర : ఆళ్ళేదో పొరపడుతున్నారు. తెలవకముందు జారుకుంటే...

రామ: రెండుమూడు రోజుల్దాకా మరేం భయముండదురా!

నర : నా మాటినుబాబూ. కడుపునిండింది. జేబునిండింది. యెంత తొరలో తప్పుకుంటే అంతమేలు.

రామ: ఎక్కడో తీతువుపిట్టగాడివి దొరికావురా నాకు! సరేలే, సామానుకట్టి సిద్ధంగా వుంచు. మంచిగుర్రబ్బండీ మాట్లాడు. అవసరమయితే క్షణంలో దాటుకోడానికి ఏర్పాట్లన్నీ కానీ... ఈ వుత్తరం పోస్టులో వేసిరా.

నర : నే సామాను సద్దేత్తాను. వుత్తరం యీళ్ళనౌకరుసేత పంపిత్తా (వెళతాడు)

పైనించి : 'వొదిలిపెట్టండి. మేము చూడాలి' వీల్లేదు; 'ఎవర్నీ వొదిలిపెట్టకూడదని ఆర్డరుంది' 'వొదలండి' వొదలండి-'కదిత్తే నరికేస్తాను' అని కేకలు

రామ: నరసన్నా, ఏమిటది?

నర : (ప్రవేశించి) చాలామంది అర్జీలట్టుకొచ్చారుబాబూ. తమర్ని సూత్తానంటూరు. లోనికి రానియ్యటంలేదు పోలీసువాళ్ళు.

రామ: వాళ్ళని చూడ్డానికిప్పుడు టైములేదుకాని, సావకాశంగా చదువుతానని అర్జీకాగితాలు పుచ్చుకో. సొమ్మెవరైనా తీసుకొస్తే వసూలుచెయ్యి.

నర : పెమాదం బాబూ.

రామ: ఏడిశావు. చెప్పినట్లు చెయ్యి. తిన్నగా లెక్క చెప్పక పోతే వాళ్ళు వాలిచేస్తాను.

నరసన్న వెళ్ళిపోతాడు. కవిత ప్రవేశిస్తుంది.
ఆఖరి ముక్కలు ఆవిడ చెవిని పడ్డాయి.

కవిత : అమ్మబాబో!

రామ: ఏమయిం దే మయింది (అని కవితకేదో అపాయం వొచ్చినట్టూ, తను రక్షించడానికి పరుగెత్తు కొస్తు న్నట్టూ మీదికొస్తాడు)

కవిత: వాళ్ళు వాలిచేస్తానంటే భయమేసింది!

రామ: అమ్మయ్య! అంతేకద!

కవిత : క్షమించాలి. తెలీకొచ్చాను. రాచకార్యాలేవో చేసు కుంటూవుంటే ...

రామ: ఎంతమాట! మీ దర్శనంకంటె చెయ్యదగిన రాచ కార్యముందా!

కవిత: సోదర్ఘా! మీలా జవాబులు చెప్పగలిగినవారిని, నే నిదివరకెప్పుడూ చూళ్ళేదు.

రామ: మీ సుందర వదనారవిందం చూడగానే ఎక్కడ లేని చాకచక్యమూ పుట్టుకొస్తోంది. కూచోండి. రత్నఖచిత సింహాసనం మీద ఆసీనులు కావలసిన మీకు ఈ క్షుద్ర కుర్చీ అర్పించవలసొచ్చిందిగదా అని చింతగావుంది.

కవిత: వేళాకోళం చేస్తున్నారు. నే వెళ్ళిపోతానమ్మా ... (కూచుంటుంది.)

రామ: హృదయం విప్పి మాట్లాడుతున్నాను, వేళాకోళమా! (కవిత కట్టుకున్న చీర చూపిస్తూ) ఎంత అందమైన చీర! ఎంత అదృష్టం ఈ చీరది!

కవిత: అంత మెచ్చుకోడానికి ఏముంది! మామూలు చీరే...

రామ: మీ సాంగత్యంచేత పవిత్రమయింది. ఆహాహా. నేనే మీ చీరనయితే... మీ హృదయానికి హత్తుకుని వుందునుగదా!

కవిత: నా కర్థంకావమ్మా మీ మాటలు! ఉస్సు... చాలా ఉక్కగా లేదూ?

రామ: హృదయం దహించుకుపోతూవుంటే... ఈ ఉక్కో లెక్కా.

కవిత: అబ్బ... ఉందురూ!

రామ: ఉంటాను. (కొంచెం ముందుకి జరిగి) మీ సాన్నిధ్యంలో వుండడానికే ఈ ఆరాటం!

కవిత: అంతా కవిత్వం! అన్నట్టు- నాకు రెండు మంచి పద్యాలు రాసిపెట్టరూ... మీకు చాలా వొచ్చి వుండాలి.

రామ: దాని కేం భాగ్యం. అలాగే రాసిస్తాను. నే అల్లిన పద్యాలే రాయనా? పాత పెందుకు... ఆశువుగా యిప్పుడు చెబుతాను.

"తరుణీ, నీ కోమలహస్తంబుల" (అని కుర్చీ ఇంకా దగ్గిరగా ఈడ్చుకు చేతులు పట్టుకోబోతాడు.)

కవిత: (చేతులు లాగేసుకు వెనక్కి జరిగి) మీదకి రాకండి.

రామ: (వినిపించుకోకుండా)

" క్రొం జిగురాకు ప్రేకల కురుల్ తటియార్చుచు
కూరుచున్న ఆ
వ్యంజన మంగళాంగి జడ అల్లుదునా "

(అని జడపట్టుకోబోతాడు.)

కవిత: (కోపంతో) పల్లెటూరివాళ్ళమని చులకనగా కనిపిస్తు న్నామా ?

రామ: నా హృదయంలో బరువై కూర్చున్న మీరు ... చుల కనా ...

కవిత: చాలు చాలు.

రామ: కోప మొచ్చినట్టుంది. క్షమాభిక్ష వేడుకొందునా! (మోకరించి)

"మకరందమాధురీ మంజులమామక ప్రణయమానస
భావనలే ప్రఫుల్ల పుష్పాంజలిచేసి, నీ అడుగులందున
సమర్పణ చేసికొందునా...."

ఈ పోజులో ఉండగా చంద్రిక ప్రవేశిస్తుంది.

చం: ఇదేమిటి ?

కవిత: ఈయనేమో... నేనేమో ...

చం: సిగ్గులేదూ... లోపలికి పో. (కవిత లోపలికి వెళు తుంది.)

రామ: (మోకరించి చంద్రికవైపుకి తిరిగి)

చూచెదవేలనో ప్రణయసుందరి కౌటుక కళ్ళలోని ఆ
లోచన లేమిటో హరిణలోచని, నీ చిరునవ్వులలోని సం
కోచము లెందుకో కుసుమకోమలి, నీ మధురాధరమ్ములో
దాచుకొనంగ నేటికి సుధామయసూక్తి కళావిలాసినీ"

చం: ఏమిటిది ?
రామ: ప్రేమ.
చం: ప్రేమా ! ఎవరిమీద ?
రామ: మీమీదే.
చం: సంసారం చేస్తున్నదాన్ని, నామీద ప్రేమేమిటి ?
రామ: ప్రేమ గుడ్డిది.
చం: ఎవరైనా వింటే నవ్వుతారు.
రామ: నవ్విపోదురుగాక, నాకేటి సిగ్గు !
చం: లోకంలో బతకొద్దూ.
రామ: లోకముతో మనకేటికి లోలాక్షీ ...

తెలియదా ప్రేమికులకు –

"నీకు నీ వారులేరు
నాకు నావారులేరు
మల్లెపూల తెప్పగట్టి
తెప్పమీద తేలిపోదంగదవే...."

పోజులో మోకరించి వుండగా—

కవిత: (పరిగెత్తుకుంటూవొచ్చి) అమ్మా, నాన్న నిన్ను ...
(చంద్రిక, రామచంద్రయ్యలకేసి తీక్షణంగా చూస్తూ)
చాలా బాగుంది వ్యవహారం... నాన్నతో చెప్పనా..,

చంద్రిక గాభరాపడుతుంది. కాని రామచంద్రయ్య
సమయస్ఫూర్తితో ధోరణి మార్చేస్తాడు

రామ: మీరు చెప్పండి. మా వివాహానికి సమ్మతించేటట్టు నచ్చచెప్పండి.

చం: (తేరుకుని) విన్నావా? నిన్ను ప్రేమిస్తున్నారుట. పెళ్ళిచేసుకుంటారుట! వెళ్ళి చెప్పవేం మీనాన్నతో.

కవిత: (సిగ్గుపడుతూ) నువ్వే చెబితే బాగుంటుందమ్మా.

చం: వాళ్ళు జాగ్రత్తపెట్టుకుని మాట్లాడొద్దూ. అపార్థం చేసుకు బెదిరిస్తావా? ఈ వివాహానికి నేనొప్పుకోక పోతే!

కవిత: ఇంకెప్పుడూ అలా చెయ్యనమ్మా! క్షమించాలి!

పైనించి: 'క్షమించాలి; క్షమించాలి. నన్ను నాశనం చేసెయ్యకండి' అని అరుచుకుంటూ రాఘవేంద్రరావు లోపలికి పరుగెత్తుకొస్తాడు.

రామ: (లేచి) ఈ గొడవేమిటి?

రాఘు: ఎవళ్ళోవొచ్చి ఫిర్యాదుచేశారుట. ఎవరిమాటా నమ్మకండి. ఎవ్వరిమాటా నమ్మకండి.

రామ: (చిరాకుగా) వాళ్ళ సంగతి నా కెందుకు?

చం: ఈ రోజు యెంత సుదినమో తెలుసా! మన కవిత నిమ్మని అడుగుతున్నారు.

రాఘు: (అర్థంచేసుకోక) ఎందుకూ?

చం: ఎందుకేమిటి? పెళ్ళిచేసుకోడానికి.

రాఘు: (చంద్రికతో) తలకి తగని పరుగులెత్తకూడదు. మనం అంతగౌరవానికి అనర్హులం. పిచ్చివేషా లెయ్యకు! ఇలాటి విషయాల్లో వేళాకోళం తగదు!

రామ: వేళాకోళంగాదు. మీ అమ్మాయిని చాలా ప్రేమి స్తున్నాను. వివాహం చేసుకుంటా నంటున్నాను.

రాఘు: నమ్మను. నమ్మలేను!

రామ: ఇంక ఆలోచించక ఒప్పేసుకోండి. లేకపోతే నేనేం చేస్తానో, నాకే తెలీదు. విరహతాపంలో దగ్ధమయి పోవొచ్చు. పిచ్చెత్తి ఆత్మహత్య చేసుకోవచ్చు! (బెదిరిస్తూ) నా మరణానికి నువ్వు కారణమవుతావు! ఉరి పడిపోతుంది!!

రాఘు: వొద్దొద్దు. నేనేపాపం చెయ్యలేదు. మీరేం చెయ్య మంటే అదిచేస్తాను. దేనికయినా తయారు!

చం: ఏం గాభరా మనిషమ్మా! మీరేం చెయ్యనక్క ర్లేదు, వాళ్ళవివాహానికి అనుమతించి, దీవనలివ్వండి, చాలు!

రామచంద్రయ్య కవిత చెయ్యపుచ్చుకుని రాఘ
రావు వేంద్రరావు దగ్గిరకొచ్చి నమస్కరిస్తాడు.

రాఘు: కళ్యాణమస్తు. పుత్రపౌత్ర ప్రాప్తిరస్తు!

నరస: (లోపలికొచ్చి) బండి సిద్ధంగావుంది!

రామ: ఆ...(అందరినీ ఒక్కమాటు కలయజూసి, మనసు నిశ్చయం చేసుకుని) వొచ్చేస్తున్నా!

రాఘు: ఎక్కడికన్నా వెళుతున్నారా ?

రాము: అవును. ఓమాటు వెళ్ళాలి.

రాఘు: ముహూర్తం నిశ్చయం చేసుకుని...

రాము: రేపు మళ్ళీ వొచ్చెయ్యనూ! దగ్గర్లోనే మా మేన మామ ఒకడున్నాడు. పిల్లలులేరు. డబ్బు మూలుగు తోంది. అతనితో చెప్పిస్తే మంచిదని...

రాఘు: అవునవును. తప్పకుండా చెప్పిరావాలి.

రాము: వెళ్ళొస్తాను. కవితా... నన్ను మరిచిపోకు. అత్త గారూ... దేహమెక్కడున్నా, మనసంతా ఇక్కడే వుంటుంది ! (రెండడుగులేస్తాడు)

రాఘు: ప్రయాణానికి ఏమైనా కావాలా? సొమ్ము తక్కువగా వుందన్నారు...

రాఘు: (జేబు చూసుకుంటూ) ఇప్పుడు ఫరవాలేదు... పోనీ మీకివ్వాలనుకుంటే...

రాఘు: ఏమాత్రం.

రాము: మొన్న రెండొందలిచ్చారు; అంటే నాలుగొంద లనుకోండి. ఇప్పుడో ఆరొందలిస్తే, మీకో వెయ్యి ఇవ్వ వలసుంటుంది. మొత్తంగా ఒక్కనోటు ఇచ్చె య్యొచ్చు !

రాఘు: ఆ మాట తలపెట్టకండి !

జేబులోంచి తీసి, ఆరు వంద రూపాయలనోట్లు ఇస్తాడు

రాము: కొత్తనోట్లు; బాగున్నాయి. వెళ్ళిరానా. గుండె పగిలిపోతోంది.

ఫిలిమ్సుల్లో వ్యక్తులు విడిపోయేటప్పుడు చేసేహంగామా చేస్తూ గబగబ నడిచి వెళ్ళిపోతాడు. అతనివెనకాల రాఘవేంద్రరావు, చంద్రిక, కవితకూడా వెళతారు. స్టేజీమీద ఎవరూ వుండరు. పైనించి గొంతుకలు వినిపిస్తాయి.

కవిత : త్వరలో వొచ్చేస్తారు కాదూ?

రామ : రేపు, తప్పితే, ఎల్లుండి వొచ్చివాలనూ?

ఒక్కక్షణం నిశ్శబ్దం. రాఘవేంద్రరావు, కవిత, చంద్రిక తిరిగొస్తారు.

రాఘు: చూశారా, మన తడాఖా! మన్ని పడగొట్టటాని కొచ్చాడు; తనే పట్టుబడిపోయాడు.

చం : (వెటకారంగా) ఆ. అంతా మీ ప్రయోజకత్వమే!

రాఘు: కాదు. నీ ప్రయోజకత్వం!

చం : కాక.

కవిత : ప్రయోజకత్వం ఎవరిదైనా, ఫలితం నాదికదూ!

చం : మా కెవరికీ దక్కకుండా చెయ్యగలవా, చుప్పనాతీ!

రాఘు: నీ భాగ్యం, మా భాగ్యంకాదూ. అందరికీ కబురు పంపించాలి. (గట్టిగా కేకలేస్తూ) నారాయుడూ, బండి తీసుకెళ్ళి ఆచార్లుగారినీ; నాయుణ్ణీ, చంద్రశేఖరాన్ని తీసుకురా! ఇక్కడున్నట్టు రావాలి. పెళ్ళికళరావాలి ఇంటికి. సన్నాయిమేళం వినిపించండి (కవిత గ్రామఫోనులో సన్నాయిరికార్డు పెడుతుంది) దొడ్లోమామిడాకులు తెంపుకొచ్చి తోరణం కట్టండి.

కవిత, చంద్రిక లోపలికెళతారు. సన్నాయిరికార్డు నడుస్తూవుంటుంది. రాఘవేంద్రరావు లోపలికెళ్ళి పన్నీరుబుడ్డి, అత్తరుదాను, అగ రొత్తుల స్టాండు తీసుకొస్తాడు. అగరొత్తులు పెట్టి వెలిగిస్తాడు. పన్నీరుబుడ్డిలో, పన్నీరుందో లేదో మీద జల్లుకు చూస్తాడు.

రుద్రయ్య, భద్రయ్య ప్రవేశిస్తారు

భద్ర: జయీాభవ!

రుద్ర: విజయీాభవ!

రాఘు: (ఏమీా ఎరగనట్టు నటిస్తూ) ఏమిటీ గొడవ?

భద్ర: గొడవేమరి? పెళ్ళిపన్లు మాటల్తో తెములుతాయా!

రుద్ర: వాళ్ళు హూనమయితే, పెళ్ళి.

కవిత ప్రవేశిస్తుంది.

రుద్ర: రా, పెళ్ళికూతురా, రా!

భద్ర: గొప్ప ఆఫీసరుగారి భార్యవయావని మమ్మల్ని మరిచి పోకు తల్లీ!

రుద్ర: మీా అబ్బాయి బారసాలకి, నేనే పురోహితుణ్ణి. ఢిల్లీలో చేసుకుందాం!

రాఘు: పెళ్ళి కానీ ముందర!

రుద్ర: పెళ్ళెంత సేపట్లో జరుగుతుంది; పిల్లడెంత సేపట్లోపుడ తాడు! (పుట్టిన పిల్లల ఏడుపు అనుకరిస్తూ కేవు కేవు మంటాడు. తరవాత లాలించినట్టు) ఒళఒళా హాయీా, ఏడవకు ఏడవకు ఎర్రినాగన్న! ఏడి స్తె నీకళ్లు నీలాలు గారు; ఒళఒళి హాయీా!

కవిత: (సిగ్గుతో) చూాడునానాన్నా, ఈాళ్ళి కేను!

రాఘు: చాలు చాలు, ఘూరుకో !

తమలపాకులు, చక్కల పళ్ళెంతోనూ, మామిడి
తోరణంతోనూ చంద్రిక ప్రవేశిస్తుంది.

రుద్ర: మీకెందుకు శ్రమ. (చేతులోంచి పళ్ళెమూ తోర ణమూ పుచ్చుకుంటాడు. ఎవరూ చూడకుండా కొంత చెక్కలగుండ నోట్లో వేసుకుని, పళ్ళెం బల్ల మీద పెట్టి) రా భద్రయ్యా, తోరణం కడదాము!

భద్రయ్య, రుద్రయ్య కలిసి, తోరణం, గుమ్మానికి కడుతూ వుండగా, నాయుడు, డా॥ చంద్రశేఖర్, ఆచార్లు ప్రవేశం. వారి వెనకాల పోలీసు సూపర్నిండెంట్ మహంకాళి.

డా. చం: కంగ్రాచ్యులేషన్సు.

నాయు: థాంక్స్యూ; థాంక్స్యూ.

ఆచా: కామధేనువుని పెరట్లో కట్టేసుకున్నారు, దివాన్జీ సాహెబ్ గారు.

రాఘు: (విజయ సూచకమైన చిరునవ్వుతో) కూచోండి! (అందరూ కూచుంటారు.) తాంబూలాలియ్యి అంద రికీనీ. (అందరికీ కవిత పేఢాలు, తాంబూలాలు ఇస్తుంది. మరోసన్నాయి రికార్డుకూడా ఈ సమ యంలో వినిపిస్తుంది.)

నాయు: అమ్మయ్య! గండం గడిచిపోయినట్టేగా!

డా. చం: మెల్లిగా అంటారేమిటి ?

రాఘు: మనమీద అతనితో ఫిర్యాదు చెయ్యడాని కొచ్చా రట కొంతమంది. వాళ్ళపా ట్లున్నాయి.

ఆచా: ఆయనతో, మీమీద పిర్యాదా? ఎంతమోసం! ఎంతమోసం!

వెంక : ఎంతమోసం, ఎంతమోసం! (అంటూ ఆక్షణం లోనే ప్రవేశిస్తాడు)

రాఘు: ఏమి ఏమిటి?

వెంక : మనం ఇనస్పెక్టర్ జనరల్ అనుకున్నాము; అతను ఇనస్పెక్టర్ జనరల్ కాదు.

డా. చం: కాదూ?

నాయు: అదెలా?

ఆచా: అసంభవం!

వెంక : ఇనస్పెక్టర్ జనరల్ కానేకాదు. వుత్తరంవల్ల కని పెట్టాను.

రాఘు: వుత్తరమేమిటి? కనిపెట్టడమేమిటి? తెలిసేమాట్లాడు తున్నావా?

వెంక : ఓ. అతనురాసిన వుత్తరం, మీ నారాయుడు తీసు కొచ్చి పడేశాడు. యాదాలాభంగా అడ్రసు చూశాను. పోస్టాఫీసు స్ట్రీటు, న్యూఢిల్లీ. మా హెడ్డాఫీసు పోస్టాఫీసు స్ట్రీటుకాదూ. మనమీ దే మన్నా రాశాడా ఏమిటి కొంపతీసి; చూద్దాం- అని వుత్తరం విప్పాను.

రాఘు: అతనురాసిన వుత్తరం ముట్టుకోడానికి ధైర్యమెలా వొచ్చింది?

వెంక: తెలీదు. నాలోనాకు అంతర్యుద్ధమయింది. "విప్పి చూడు" అని మనసు చెప్పింది. "విప్పకు. ప్రమాదం"

అని బుద్ధిసూచించింది. "సంగతులు తెలుసుకోకపోతేనే హెచ్చు ప్రమాదం, జాగ్రత్త" అని మనసు హెచ్చరించింది. వొణుకుతున్న చేతులతో, ఆవిరిమీద పెట్టి కవరు విప్పాను.

రాఘు: (కోపంతో) ఎలా సాహసించావు, అంత గొప్ప ఆఫీసరు ఉత్తరం చించడానికి!

వెంక: అదే తమాషా! గొప్పాలేదు, ఆఫీసరూ కాడు!

రాఘు: నీ ఉద్దేశ్యంలో ఎవరేం?

వెంక: ఎవడో! దేవుడికి తెలియాలి, లేకపోతే దెయ్యానికి తెలియాలి.

రాఘు: వొళ్ళు జాగ్రత్తగా పెట్టుకు మాట్లాడు! అపచారానికి అరెస్టుచేయిస్తాను.

వెంక: ఎవరు? మీరా!

రాఘు: అవును!

వెంక: మనని అరెస్టుచేసే అధికారం మీకెక్కడిది? ఎవరిచ్చారు?

రాఘు: అతను నా అల్లుడవబోతున్నాడని తెలుసా! ఢిల్లీ వెళ్ళి నీ పిలక ఎక్కపీకించేస్తాను.

వెంక: నా పిలక ఎవరిచేతికీ అందకుండా ఎప్పుడో కత్తిరించేశాను. శాంతించండి! శాంతించండి. ఉత్తరం చదువుతాను. మీకే బోధపడుతుంది. (వెటకారమైన వినయ విధేయతలతో) శలవైతే ప్రారంభిస్తాను.

ఆచా: చదవండి! చదవండి!

వెంక: (ఉత్తరం చదువుతాడు)

ప్రియమైన కళాపతికి

నా దగ్గరనించి అకస్మాత్తుగా ఈ ఉత్తరం చూసుకుని నువ్వు ఆశ్చర్యపడొచ్చును. నేనింకా ఢిల్లీలోనే వున్నానని అనుకుంటున్నావేమోకూడాను. మూర్ఖుడు మా నాన్న పోరుపడలేక, అవ్యవధిగా, బయలుదేర వలసొచ్చింది. మరేమీ అనుకోకు. ఇంటికి వెళుతూం డగా, మధ్యదారిలో ఒక అద్భుత సంఘటన జరిగింది. జరిగిందేమిటి ? ఇంకా జరుగుతూనేవుంది. పర్యవసానం పూర్తికాకపోయినా, నా అదృష్టానికి సంతోషించేవాడివి కనక, వెంటనే తెలియజేస్తున్నాను. రాసినది ప్రతిఅక్షరం నిజం! నీ దగ్గర నే నేమీ కొయ్యనని నీకు తెలిసిందేకదా! ఈ వూరు చేరిననాడే ఒక పేకఆటలో నా వద్దనున్న సొమ్మంతా ఖర్చయి పోయింది. మోసంచేసి గెలుచుకున్నా రని నా అనుమానం. ఎలా గెలుచుకుంటేనేం, నా దగ్గిర దమ్మిడీ మిగలలేదు. అప్పు ఇవ్వడానికి నిరాకరించి, నన్ను బయటకు నెట్టుతానని హోటలువాడు బెదిరిస్తున్న సమయములో అకస్మాత్తుగా వూళ్ళో అధికారులు ప్రత్యక్షమై నా కష్టాలు పారద్రోలి బ్రహ్మరథం పట్టడం ప్రారంభించారు. నా వేష భాషలవల్ల, నేను ఢిల్లీనుంచి వొచ్చిన ఒకగొప్ప అధికారినని వారందరూ—వారేకాదు, వూళ్ళో అందరూ కూడా భావిస్తున్నారు. ప్రస్తుతం నేను జిల్లా ఆఫీసరు

గారి బంగళాలో, వారి స్వయం అతిథిగా వుంటున్నాను. నా జీవితంలో ఎప్పుడూ ఇంత భోగమూ, వైభవమూ అనుభవించలేదు. వారికి ఒక కూతురు, భార్యాకూడా కలరు. ద్వితీయ మగుటచేత భార్యకూడా లేత వయస్కురాలే. తల్లీ కూతుళ్ళలో ఒకరినే యెంచి, యేరుకోడం అశక్యం, అనవసరం కూడా కనక, ఉభయుల మీదా సమ్మోహనాస్త్రం ప్రయోగించాలనే నిశ్చయించాను. ఎవరిని ముందు వశ్యులు చేసుకోవాలన్నదే సమస్య! ఇలాటి క్లిష్ట పరిస్థితులలో నీ సలహా లభించితే, అమూల్యమై వుండును. కాని పురోభివృద్ధి నిమిషాలమీద జరుగుతోంది కనక సలహానిమిత్తం వేచిఉండడం అసంభవము. అనుభవశాలిని కనక తల్లితో ప్రారంభిస్తేనే క్షేమమేమో. మరోసంగతి. ఒక్కొక్కప్పుడు అప్పుపుట్టక ఢిల్లీలో మనమెంత బాధపడేవాళ్ళమో జ్ఞాపకముందా? ఇక్కడి వాతావరణమే వేరుగావుంది. అందరూ నాకు అప్పిచ్చేవారే! ఎంత కావలిస్తే అంత! దీన్లో చిదంబర రహస్యం నువ్వీపాటికి గ్రహించే వుంటావు. ఆఫీసర్లందరూ గూడుపుఠాణే.

సర్కారుసొమ్ము చాలావరకు గుటకాయి స్వాహా. అప్పివ్వడానికి ఇంత ఆత్రుతా, మనకన్నుగప్పి నోరు కట్టే యత్నమే. స్వయంగా గొయ్యి తవ్వుకు గోతిలో ఉరుకుతున్నట్టు తెలుసుకోలేని ఈ మహానుభావులంతా గొప్ప వ్యవహార వేత్తలమనీ, కిలాడీలమనీ

భావించుకుంటున్నారు. ఎంత తమాషా పరిస్థితి! ఎంత తమాషా వ్యక్తులు! నువ్వురాసే కథల్లోనూ, నాటికల్లోనూ. సులభంగా వీళ్ళని హాస్యానికి ఉపయోగించుకోవచ్చును. వీరందరికి నాయకుడు జిల్లా ఆఫీసరు, మాజీ దివాన్జీ సాహేబు రాఘువేంద్రరావు. పంచకళ్యాణి గుర్రంలా నిండైన విగ్రహం. తెలివితేటలు మాత్రం గాడిదవి.

రాఘు: ఛీ ఛీ. ఆ వుత్తరంలో అదేమీ లేదు.

వెంక: చూడండి– నే అబద్ధం చదువుతున్నానేమో?

రాఘు: (చూస్తూ పైకి చదువుతాడు) పంచకళ్యాణిగుర్రంలా నిండైన విగ్రహం. తెలివితేటలుమాత్రం గాడిదవి. నువ్వే రాసుంటావు.

వెంక: నేనా ? ఇలాటి వుత్తరం నే నెలా రాయగలను చెప్పండి?

డా.చం: చదవండి; చదవండి!

వెంక: పంచకళ్యాణిగుర్రంలా నిండైన విగ్రహం. తెలివి తేటలుమాత్రం గాడిదవి !

రాఘు: కోపంగా చదివిందే మళ్ళీమళ్ళీ యెన్నిమాట్లు చదువుతావు? తరవాత చదువు.

వెంక: (చదువుతూ) పోస్టుమాస్టరు వెంకప్ప పంతులు ... వెంకప్ప పంతులు. ఇక్కడ నన్నుగురించీ యేదో అసభ్యంగా రాశాడనుకోండి. ఇలాటి వుండాకోరు రాతలన్నీ ...

డా.చం: చదవండి. చదవండి.

వెంక: ఎందుకూ ?

రాఘ: మొదలెట్టింది పూర్తి చెయ్యొద్దూ ?

డా.చం: నే చదువుతానుతెండి. (ఉత్తరంతీసుకు చదువుతూ)
వెంకప్ప పంతులు జిత్తులమారి నక్క! మల భక్షకు
డగుటచే కొన్ని గుణంబుల కుక్క.

వెంక: వీపు పెట్లగొట్టెయ్యాలి; ఆ ముక్కలు రాసినందుకు.

డా.చం: (చదువుతూ) ఆసుపత్రి సూపరింటెంటు డాక్టర్
చంద్రశేఖర్ ... చంద్రశేఖర్ (నసుగుతాడు)

ఆచా: ఆపేశారేం ?

డా.చం: ఇక్కడ గిలికిపారేశాడు. చదవ శక్యంగాదు, వెధవ
రాత.

ఆచా: శలవైతే నే చదువుతాను. దస్తావేజులు చదవడం
చాతవును నాకు.

డా.చం: అవసరం లేదండి. రెండుపంక్తులు దాటేస్తే, మిగ
తాది బాగానే వుంది- నే చదవగల్ను.

ఆచా: ఆ రెండుపంక్తులుమాత్రం దాటడ మెందుకండీ! నే
చదువుతానుగా! (అని చేతులోంచి తీసుకుంటాడు.)

డా.చం: (వేళ్ళు అడ్డంపెట్టి) ఇక్కణ్ణించి చదవాలి.

ఆచా: వేలు తొలగించండి స్వామీ. ఆద్యంతాలు చదవ
మని దివాన్జీగారి ఆజ్ఞ యెప్పుడో అయింది. (డాక్టరు
చెయ్యి బలవంతంగా తీసేస్తాడు) ఆసుపత్రి సూపరిం

డెంటు తిండికి పరిదికొక్కు. వైద్యంకంటె వంట విషయాలే బాగా తెలుసును. నిషా వస్తువులుకూడా అడపా తడపా సేవిస్తాడని అనుమానం.

డా. చం: చెడతిని నన్నంటాడా ?

ఆచా: (చదువుతూ) హెడ్మాస్టరు, ఆచార్లు... ఆచార్లు-

డా. చం: ఆపకండి, ఆచార్లుగారూ.

వెంక: నే చదివిపెట్టనా (ఉత్తరం తీసుకు) ఆచార్లు పాడుం కంపు. కనక నే వారిభార్య, వారిని దరిజేరనీయక...

ఆచా: పోకిరీ వెధవా! ఆడవాళ్ళసంగతికూడా ఎత్తుతాడు అనవసరంగా!

వెంక: జడ్జీ నాయుడుగారిని పట్టెనని వినికిడీ. లంచాలు స్వీక రించడంలోకూడా జడ్జీగారు సిద్ధహస్తులు. వారసలు కాంతా కనకంబులలో ఏది లభించినా విడిచిపెట్టరట. పూజారి భద్రయ్యకికూడా వారంటే హడలు.

నాయు: అన్యాయం, అన్యాయం. నే నే పాపమెరగను.

వెంక: పూజారి భద్రయ్యా, పురోహితుడు రుద్రయ్యా, ఈ పూరి కరటక దమనకులు; సుందోపసుందులు.

రుద్ర: ఇవేం కొత్తతిట్లు, ఆచార్లుగారూ ?

వెంక: హస్తలాఘవంలోమటుకు అందరూ ఆరితేరిన మహాను భావులే. ఇక్కడ జరుగుతున్న కుట్ర, మోసం, బయటపెట్టదగినవే కాని ఆపద సమయంలో ఆదు కున్నారుగదా, ఆ పాపం మనకెందు కనుకుంటు

న్నాను. పైగా మన విషయంలో బోల్తాకొట్టి పరాభవం పొందుతున్నారు. దీనివల్ల బుద్ధి రాకపోతే, ఎప్పుడో ఇంకా గట్టిగా తినగలరు. కనక లభించినది గ్రహించి ఉపద్రవం రాకమునుపు ఉడాయించడమే మన కర్తవ్యం, కార్యక్రమం. కాంతలమీద కాంపెయిన్‌కి కాలాతీత మయిపోతోంది. పురోగమనం అప్పుడప్పుడు తెలుపుతూనే వుంటాను.

నీ ప్రియమిత్రుడు

రామచంద్రం.

(ఉత్తరంమడిచి జేబులో పెట్టుకుంటూ) ఇదీ వుత్తరం. అందరినీ పాతేశాడు.

రాఘు: నా కేమీ పాలుపోకుండావుంది. బుర్ర పనిచెయ్యడం మానేసింది. వాణ్ణిపట్టుకు లాక్కురాలేమూ!

వెంక: రైలెళ్ళిన అరగంటకిగాని ఈ వుత్తరం విప్పలేదు. ఎక్కడని వెతికి పట్టగలం!

నాయు: ఎంత అన్యాయం. నా దగ్గిర్నించి మూడొందలు పుచ్చుకున్నాడు, అప్పని!

డా.చం: నేనూ యిచ్చుకున్నాను, మూడొందలు.

ఆచా: వీడి దారుణం మండా! నా దగ్గిర నాలుగొందలు కొట్టేశాడు.

రుద్ర: నేనూ భద్రయ్యా కలిసి రూపాయి తక్కువ వంద దక్షించుకున్నాం.

నాయు: ఇంత మోసం ఎలా జరిగిందో! మనందర్నీ ఇంత తేలికగా ఎలా బోల్తా కొట్టించగలిగాడో!

రాఘ: (నెత్తి బాదుకుంటూ) ముప్ఫయ్యేళ్ళు దివాన్గిరీ చలాయించి, మంత్రాంగం చేశావుగదా, శుంఠా నీ తెలివితేటలన్నీ ఎక్కడ ఇంకిపోయాయిరా!

చం : బుర్ర బాదుకుంటూ కూచుంటే ఎలా! అతన్ని పట్టుకు తీసుకురావడానికి ఉపాయం ఆలోచించండి. అమ్మాయిని పెళ్ళిచేసుకుంటా నన్నాడుకూడా!

రాఘ: పెళ్ళి కాదు; పెటాకులు! సిగ్గు లేదూ– పెళ్ళిమాటెత్తడానికి. (వాళ్ళు మండిపోతుంది) మన పెళ్ళి చేశాడు... వినండి. లోకమంతా తెలియనివ్వండి. ముప్ఫయి సంవత్సరాలు దివాన్గిరీ చలాయించి, రాజ్యమంతా చిటికిన వేలుమీద తిప్పిన రాఘవేంద్రరావుని, ఒక బొడ్డూడని కుర్రకుంక బోల్తా కొట్టించాడు. అపర చాణక్యుడని పేరు పొందిన రాఘవేంద్రరావు ఈనాడు కథల్లోనూ, నాటికల్లోనూ ఒక హాస్యవ్యక్తి కింద జేరబోతున్నాడు. అతని జీవితమే ఒక ప్రహసనమై పోయింది. (డా॥ చంద్రశేఖర్ వగైరాలు నవ్వుతారు. వాళ్ళమీదికి తిరిగి) షటప్ (Shut up) నోరుముయ్యండి. (వాళ్ళు నోరుమూసు కుంటారు. ప్రేక్షకుల్ని చూసి) ఎందుకు నవ్వుతారు? ఇకిలిస్తే మీపళ్ళే బయటపడతాయి. జీవితంలో ప్రతి వాడికీ కాలుజారుతుంది. మీరందరూ మాత్రం

మోసపోలేదూ! ఇనస్పెక్టర్ జనరల్‌ట– ఇనస్పెక్టర్ జెనరల్! వాడు ఇనస్పెక్టర్ జెనరల్ అని మొదట అన్నదెవరు! (అందరిమీాదా ఉరిమిచూాస్తాడు)

డా: చం: ఎవరు పుట్టించారో ఈ పుకారు.

నాయు: జ్ఞాపకంలేదూ! అరుగో మహానుభావులు!

భద్రయ్య, రుద్రయ్యలవైపు చూపిస్తాడు

భద్ర: నేనుకాదు, నాకంత బుద్ధెక్కడేడిసింది!

రుద్ర: నే నంతకంటెకాదు. వొట్టి పురోహితుణ్ణి. నాకూ ప్రభుత్వానికీ సంబంధ మేమిటి?

డా. చం: జ్ఞాపకమొచ్చింది. ఇద్దరూ పరుగెత్తుకుంటూ వచ్చి 'వొచ్చేశాడు, వొచ్చేశాడు.' అని అరిచారు.

రాఘు: మీాయిద్దరే... పూజారీ, పురోహితుడూ. దేవుణ్ణి కాదు, డెయ్యాన్ని ఆరాధించే పుండాకోర్లు మీా యిద్దరూ.

నాయు: చవటలు, మీా యిద్దరు!

డా.చం: కరటక దమనకులు, మీా యిద్దరూ.

ఆచా: సుందోప సుందులు మీా యిద్దరూ.

భద్ర: రుద్రయ్యా, నువ్వే మొదట...

రుద్ర: కానేకాదు, నువ్వే మొదట...

భద్ర: నువ్వే!

రుద్ర: నువ్వే!

ఒకరినొకరు చేతులుజాపి విందించుకుంటూ వుంటారు. దవాలీబంట్రోతు ప్రవేశిస్తాడు.

డవాలీబం్రటోతు: (గట్టిగా, స్టేజీమీాద వ్యక్తులూ, ప్రేక్షకులు కూడా అదిరిపోయేటట్టు) నిశ్శబ్దం! నిశ్శబ్దం! (అంతా నిశ్శబ్దం అయిన తరవాత) ఢిల్లీనించి ఇనస్పెక్టర్ జెనరల్‌గా రొచ్చారు. అయిదునిమిషాల్లో ఈ యింటి తనిఖీ కొస్తున్నారు. ఎవరూ కదలొద్దు.

అందరూ ఒక్కమాటుగా "ఆ" అని ఎవరున్న పోజులో వారు స్తంభించి పోతారు. కొంతసేపు వారలా వున్న తరవాత

[తెర]

—*—

## మా నా ట కా లు :

| | | |
|---|---|---|
| ఈనాడు | ఆత్రేయ | 1 8 |
| పరివర్తన | " | 1 8 |
| భయం | " | 1 8 |
| కప్పలు | " | 1 8 |
| వరప్రసాదం (4 నాటికలు) | " | 1 8 |
| ఎవరుదొంగ? (3 నాటికలు) | " | 1 8 |
| ప్రగతి (5 నాటికలు) | " | 1 8 |
| నాటకం | డి. వి. నరసరాజు | 1 8 |
| వీలునామా | " | 1 8 |
| అంతర్వాణి | " | 1 8 |
| ఇల్లు అమ్మబడును | " | 1 8 |
| పల్లెపడుచు | పినిశెట్టి | 1 8 |
| అన్నా - చెల్లెలు | " | 1 8 |
| ఆడది - ఇతర నాటికలు | " | 1 8 |
| మావూరు | అనిశెట్టి | 1 8 |
| పాలేరు | బోయి భీమన్న | 1 8 |
| కూలిరాజు | " | 1 8 |
| మహానుభావులు | సోమంచి | 1 8 |
| ఉమర్ ఖయ్యామ్ | చిల్లర | 1 8 |
| వారసురాలు | 'శివం' | 1 4 |
| మనసమాజం | పి. వి. ఆచార్య | 1 4 |
| కాళరాత్రి | ప్రఖ్య | 1 8 |

MAHANUBHAVULU A DESI PUBLICATION

★

S. YAGNANNA SASTRY RS. 1-50